# PATHAMJALA YOGA SASTRAMU.

ఓం.

పరమాత్మనే నమః.

# పాతంజల యోగశాస్త్రము

ఆంధ్ర తాత్పర్య సహితము.



ఇది

ఓ - వై - శ్రీ. దొరసామయ్య చే

భోజవృత్తి ననుసరించి

ఆంధ్రీకరింపఁబడినది.



చెన్నపురి:

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.



1941

దీనివెల] [రూ. 1-0-0.




కీర్తిశేషులు:

వేలూరు - కుప్పుస్వామి మొదలియారు.

ప్రొప్రైటరు.

వెస్టు వార్డు అండు కంపెని,

(ఏ. డి. ప్రెస్.)

చాకలపేట పోస్టు, మద్రాసు.

# పీఠిక.



ప్రపంచంబునం గల మానవులలో వివేకజ్ఞులు కొందఱు దుఃఖ సాగర మైన సంసారమునుండి తరింపవలయు నని తలంచెదరు.

అట్టివారికి సాధనముగా మహాత్ము లనేకు లనేక గ్రంథములను రచియించి వానిని పరంపరగా నుపదేశించుటకై అనేక మతములను శిష్యులను నియమించిరి.

ఆ జ్ఞానసాధనగ్రంథములలో నెల్ల ప్రధానమైనవి యోగగ్రంథములు. ఆ యోగగ్రంథముల కన్నిటికిని మాతృక యనఁదగినదియును, ఆదిశేషాంశ సంభూతు లైన శ్రీమత్పతంజలిమునిప్రణీత మైనదియును అగు ఈ యోగ సూత్రములుమాత్రమే దర్శనగ్రంథమై ప్రకాశించుచున్నది.

ఈ మహాగ్రంథమునకు శ్రీమన్నారాయణాంశసంభూతు లైన శ్రీవేద వ్యాసమునీంద్రులును, వాచస్పతిమిశ్రులును, ఇంకను గొందఱును భాష్య వ్యాఖ్యాటీకాదులు రచియించి యున్నారు. వానిలో నెల్ల శ్రీమద్భోజదేవ వృత్తియొక్కటిమాత్రమే సుబోధమును అనుభవవేద్యము నై యుండుటంజేసి దాని ననుసరించి తెలుఁగున పరివర్తనము గావించినాఁడను.

అయినను, ఈ పాతంజలయోగశాస్త్రమునందు నాలుగుపాదములు కలవు. వానిలో మొదటిపాద మైన యోగపాద మనఁబడు సమాధిపాదము నందు యిఁక చెప్పఁబోవు మూఁడుపాదములలోని ముఖ్యవిషయము లన్నియు సూచింపఁబడియుండుటంబట్టి, ఆ పాదమునకుమాత్రము తక్కినవ్యాఖ్యాతల యొక్క యభిప్రాయములను భోజదేవవృత్తికి తర్వాత చేర్చినాఁడను.

ఇందలి మొదటిదైన యోగ (సమాధి) పాదమునందు యోగలక్షణ స్వరూపసాధనములును, రెండవదైన సాధనపాదమునందు యోగసాధ్యో

పాయములును, మూఁడవ దైన విభూతిపాదమునందు ఐహికాముష్మికాభీష్టార్థసిద్ధిభేదములును, నాల్గవ దైన కైవల్యపాదమునందు సంశయరహితముక్తిస్వరూపనిర్ణయములును వివరింపఁబడి యున్నవి.

ఈ గ్రంథముయొక్క సారాంశమును "హఠయోగప్రదీపిక" యందు "యోగశాస్త్రసారము" అను పేరితో సుబోధ మగునట్లు ఆంధ్రవచనముగా ప్రకటించి యున్నాఁడను.

ఇది హఠయోగప్రదీపిక, రాజయోగరత్నాకరము, విచారసాగరము, మొదలగు యోగ వేదాంతగ్రంథములలోఁ జెప్పిన విషయములను విస్పష్టము చేసి సంశయములను నివృత్తి కావింపించి యిష్టార్థసిద్ధిని యొసఁగూర్చును.

మఱియు పఠితలకును శ్రోతలకును పరమానందమును ప్రాప్తింపఁ జేయును.

ఈ ప్రసిద్ధ మైన దివ్యగ్రంథమహిమనుగూర్చి ప్రశంసించుటకు సాధ్యముకాదు గాన నింతటితో విరమించుచున్నాఁడను.

ఇట్లు,

ఓ - వై - శ్రీ. దొరసామయ్య.

శ్రీరస్తు.

పాతంజల యోగశాస్త్రము

# యోగసూత్ర

# విషయసూచిక

## ౧. యోగపాదము.

| సూత్రము. | విషయము. | | పుట. |
|---|---|---|---|

## 3. విభూతిపాదము.

| సూత్రము. | విషయము. | పుట. |
|---|---|---|
| 54 సూక్ష్మవస్తుతత్త్వ దర్శనజ్ఞానసిద్ధి | ... | 101 |
| 55 తారకజ్ఞానస్వభావము | ... | 103 |
| 56 తారకజ్ఞానముచే కైవల్యప్రాప్తి | ... | ,, |

## ౪. కై వ ల్య పా ద ము.

పాతంజలయోగశాస్త్రము

యోగసూత్ర విషయసూచిక - సమాప్తము.



# విచారసాగరము

## (సాధు నిశ్చలదాస యోగీంద్ర కృతము.)

ఈ గ్రంథము ఏడు తరంగములుగా విభజింపబడి ప్రథమతరంగమున మోక్షాధికారి లక్షణమును గూర్చియు, జ్ఞాన సాధనములయిన అంతరంగ బహిరంగ సాధనములను గూర్చియు, వేదాంతమువలని ప్రయోజనము గూర్చియు, ద్వితీయతరంగమునందు దుఃఖనివృత్తి సుఖప్రాప్తి, మోక్షేచ్ఛ, వైరాగ్యము, కర్మ, జ్ఞానము, బంధము మొదలగు విషయములను గూర్చియు, తృతీయ తరంగమున గురుశిష్యలక్షణము, గురుభక్తి, గురులక్షణము, గురుసేవ మొదలగువాని గూర్చియు, చతుర్థతరంగమున ఉత్తమాధికారి, జ్ఞానోపదేశము, సుఖదుఃఖలక్షణము, భ్రాంతిలక్షణము, జీవబ్రహ్మాభేదము, జీవుని పుణ్యపాపములు, అజ్ఞాన ప్రతిబింబము, ప్రత్యక్షాది ప్రమాణములు మొదలగు అనేక విషయముల గూర్చియు, పంచమతరంగమున వేదములు, ఈషణత్రయము, భ్రాంతినివృత్తి, సంసారము, మాయ, ఈశ్వరుడు, జీవుడు, ప్రపంచసృష్టి, పంచకోశములు, మహావాక్యార్థోపదేశము, ప్రణవోపాసనము మొదలగువాని గూర్చియు, షష్ఠ తరంగమున కనిష్ఠాధికారి, పరబ్రహ్మసిద్ధాంతము, జాగ్రత్స్వప్న సమత్వము, పరిమాణము, సచ్చిదానందము, మహావాక్యార్థజ్ఞానము మొదలగు అమోఘ విషయములను గూర్చియు, సప్తమతరంగమున జీవన్ముక్తి, విదేహముక్తి, ప్రాణాయామాది అష్టాంగముల గూర్చియు ఆక్షేపణ సమాధానములతో విమర్శించి తేటతెలుగున వ్రాయబడియున్నది ఈ గ్రంథమును చక్కగా పఠించినయెడల వేదాంతమంతయు పూర్ణముగా పట్టుపడ గలదు. 400 పేజీలు గలిగి గ్లేజు కాగితములలో ముద్రింపబడియున్నది. దీని వెల రూ. 3

# వేమన పద్యములు

## టీకాతాత్పర్య సహితము. దీని వెల 1-0-0

3200 వేమనపద్యములు గలది పెద్దచ్చు వెల రూ. 2-0-0

# రాజయోగ రత్నాకరం

ఇది ఉపదేశప్రకరణము, సాధనప్రకరణము, ప్రబోధప్రకరణము, యోగప్రకరణము అని నాలుగు ప్రకరణములు గలది; ప్రతి ప్రకరణమునందును అనేక విషయములు గలిగి వేదాంతవిద్య సులభసాధ్యముగా నుండునట్లు అనేక తత్వబోధక చక్రములును, పంచీకరణాది విభాగపటములను చూపబడి శ్లోకములును, దిగువ తేటతెలుగు తాత్పర్యమును వ్రాయబడియున్నది. ఏయంశమునుగూర్చి తెలిసికొనవలయు ననుకొన్నను ఈ గ్రంథమునందు జూచిన చక్కగా బోధపడ గలదనుట కేమాత్రమును సందియము లేదు. ప్రతివారును తప్పక చదివి తీరవలయును. గ్లేజు కాగితములలో ముద్రింపబడిన 204 పేజీలు గల గ్రంథము. క్యాలికో బైండు. వెల రూ. 2

# సకలార సాగరము

ఈ గ్రంథమునందలి మొదటి తరంగము జ్ఞానసాధన తరంగము, ఇందు వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములు, భారత రామాయణాంతరార్థ వివరణములు, పిండాండ లక్షణములు మున్నగునవి దెలుపబడినవి. రెండవది సమాహిత తరంగము, ఇందు శైవము, వీరశైవము, ఆర్య, దివ్యజ్ఞాన, శాక్తేయ, బౌద్ధ, జైన, పారసీక, గ్రీకు, రోమక, క్రైస్తవ, యాదవ, భాగవత, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతాది అనేకమతములను గూర్చియు, ఆయామత సిద్ధాంతముల గూర్చియు దెలుపబడినవి. మూడవది ప్రమాణతరంగము, ఇందు అలంకార శాస్త్రమును గూర్చియు, అదృష్ట తరంగమునందు స్వప్నశకున సాముద్రికాంశములను గూర్చియు, ప్రమోద తరంగమునందు మానవధర్మములు, యోగ్యాయోగ్య కన్యాలక్షణములు, చమత్కార గణితములు, దేశాచారములు మొదలగు విషయములను గూర్చియు, కడపటిదగు విజ్ఞాన విద్యాతరంగమునందు ఆరోగ్యలక్షణము, గాలి, జలము, భోజనము, నిద్ర, వస్తుగుణ వివరణము, వ్యాధినిదానము, నాడీలక్షణము, ఔషధలక్షణము మున్నగు వానిని గూర్చియు వ్రాయబడిన 870 పుటలు గల పెద్ద గ్రంథము. అనేక విషయములు గల ఈగ్రంథమును చక్కగా పఠించినయెడల ఏ విషయమునందు ఉపన్యాస మిచ్చినను చక్కగా గ్రహించి తర్కించునట్టి సామర్థ్యము గలుగు ననుటకు సందేహము లేదు. వెల రూ. 2

# శ్రీ సీతారామాంజనేయ సంవాదము.

అనేక ప్రసిద్ధ వేదాంతగ్రంథములకు టీకాతాత్పర్యములు వ్రాసిన నోరి గురులింగశాస్త్రిలవారిచే ఈ గ్రంథమునకు టీకాతాత్పర్యము వ్రాయబడియున్నది. సీతారామాంజనేయ సంవాదమునకు టీకాతాత్పర్యము వ్రాయబడిన మొట్టమొదటి అసలు గ్రంథమిదియే. ఇందలి పద్యములకు సరియైన టీకాతాత్పర్యమును విశేషార్థములును, వివరణములను, ఛందోలక్షణములును వ్రాయబడి యున్నది. ఇందు శ్రీరాములు ఆంజనేయునకు వేదాంతలక్షణమంతయు సమగ్రముగా నుపదేశింపబడి యున్నది. వేదాంత పద్యకావ్యములలో కెల్ల ఉత్తమమై అనేక విషయములు చక్కగా వివరింపబడి వేదాంతులకు విషయములు సులభముగా గోచరింపగలవు గ్లేజు కాగితములలో ముద్రించి క్యాలికో బైండు చేయబడినది. దీని వెల రూ. 2-8-0

# జ్ఞానసింధువు.

తెలుగు వచన వేదాంతగ్రంథము. చిదానందావధూత స్వాములవారు ఒక శ్వాసమునకు ఒకపద్యమువంతు మూడువేల ఆర్నూరు శ్వాసములకు 3600 పద్యములుగల గ్రంథమును ఒక దినమందే కన్నడభాషలో రచియించియుండిరి. ఇట్టి మహత్తరమైన వేదాంత గ్రంథము ఆంధ్రులకెల్లరకు నుపయుక్తమగునటుల సామాన్యభాషాజ్ఞానము గలవారికి సైతము "బ్రహ్మజ్ఞానము" ఇట్టిదని తేటతెల్లముగా తెలియులాగున ముద్దులొలుకు మాటలతో సులభశైలిని తెలుగు వచనకావ్యముగ వ్రాయబడినది. ఇందు వేదాంతోపనిషత్ప్రతిపాదకములగు వాక్యములచే నొప్పారెడు సమస్త వేదాంతవిషయములిమిడియున్నవి. వేయేల ఒక సారి యీ గ్రంథమును చదివి వేదాంతసారామృతమును గ్రోలిన ధన్యులు కాగలరు. వెల రూ. 1

వెస్టువార్డు అండు కంపెని,

చాకలపేట పోస్టు, మదరాసు.

# PATHAMJALA YOGA SASTRAMU.



ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# పాతంజల యోగశాస్త్రము

## ౧. యోగపాదము.



శ్లో. దేహార్ధయోగ శ్శివయో స్స శ్రేయాంసి తనోతు వః
దుష్ప్రాపమపి యత్ స్మృత్వా జనః కైవల్య మశ్నుతే.

అవతారిక. సకల పురుషార్థప్రదమైన యోగశాస్త్రము నుపదేశింప నిశ్చయించిన పరమదయా స్వరూపుఁడైన పతంజలీమునీంద్రుఁడు మంగళాచరణ పూర్వకముగా గ్రంథము నుపక్రమించుచున్నారు.—

1. అథ యోగానుశాసనమ్.

తాత్పర్యము. ఇప్పుడు యోగముయొక్క స్వరూపలక్షణము చెప్పఁబడుచున్నది.

విశేషార్థము. అథ శబ్దము మంగళార్థమును, శాస్త్రప్రారంభమును, అధికారప్రాప్త్యనంతరకాలమును సహా సూచించు చున్నది. కావున మంగళాచరణ మూలకముగా అధికారులకు యోగస్వరూపమును, దాని సాధనములును, దానిఫల మగు కైవల్యమును తెలియఁజేయఁ బడుచున్నది. అనఁగా, అధికారులకు నిరతిశయానంద కైవల్యస్వరూపప్రాప్తికై యోగ

లక్షణ స్వరూప భేదోపాయాదులతోఁ గూడిన యీ యోగశాస్త్రము వివ రింపఁబడుచున్నది.

అవ. యోగస్వరూపమును నిరూపించుచున్నారు.—

## 2. యోగశ్చిత్తవృత్తినిరోధః.

తా. అంతఃకరణవృత్తులను నిగ్రహించుటయే యోగ మనబడును.

వి. సకల వ్యవహారయోగ్యమైన చిత్తవృత్తుల పరిణామరూపధర్మ ముల నిగ్రహామే యోగము. నిగ్రహ మనఁగా, చిత్తవృత్తుల లయమునకు కారణమై యుండు అగోచరమైన ప్రయత్నము. (వృత్తులను వెలుపల ప్రస రింపనీయక అంతర్ముఖము లగునట్లు చేసి చిత్తమును లయింపఁజేయుట. ఇదియే యోగము=సమాధి.) చిత్త మనఁగా, నిర్మలమైన సత్త్వగుణముయొక్క పరి ణామ మగు అంతఃకరణము. వృత్తి యనఁగా, చిత్తపరిణామరూపము.

చిత్తము పంచావస్థల (భూముల) తోఁ గూడినది. రజోగుణ ప్రధానమై సుఖదుఃఖాది విషయములందుఁ బ్రవర్తించినదియై మిగుల అస్థిరమై యుండు చిత్తము "క్షిప్తము" ఇది దైత్యదానవులకు గలిగి యుండును. తమోగుణప్రధానమై కృత్యాకృత్యవిమర్శనాజ్ఞానవివేచన లేక క్రోధాది కార్యములయందుఁ బ్రవర్తించిన చిత్తము "మూఢము". ఇది పిశాచ రాక్ష సులకు గలిగియుండును. సత్త్వగుణాధిక్యమై భోగసాధనాదులయందు బ్రవ ర్తించిన చిత్తము. "విక్షిప్తము". ఇది దేవతలకుఁ గలిగియుండును. బాహ్య మందు ప్రసరింపని చిత్తము ఏకాగ్రము. వృత్తులును సంస్కారములును లేని చిత్తము నిరుద్ధము. ఏకాగ్రనిరుద్ధ చిత్తములు రెండుమాత్రమే సమాధిని పొందఁగూర్చును.

అవ. సమాధి కాలమునందలి ఆత్మయొక్క స్వరూపమును బోధించు చున్నారు.—

## 3. తదా ద్రష్టుః స్వరూపే ఽవస్థానమ్.

తా. చిత్తవృత్తులు నిగ్రహమై యుండు (యోగావస్థయం దుండు) కాలమునందు చిన్మాత్రుఁ డైన పురుషుఁడు నిజస్వరూపమునందుండుట సంభవించుచున్నది.

వి. పురుషునకు జ్ఞానమే స్వరూపము, బుద్ధి యనెడు వస్తువునందు జ్ఞానము సంక్రమించనేని బుద్ధితత్త్వము పనులను చేయును. పురుషుఁ డెప్పుడును సుసృతియందుఁ జిక్కనివాఁడు పురుషుఁడు, ప్రకృతి అను నీ రెండును వేర్వేఱు లను జ్ఞానము కలిగనేని జ్ఞానము బుద్ధియందు సంక్రమింపదు. సంక్రమించినమీఁద 'తా' ననెడు అభిమానము పోవును. అపైన బుద్ధివికారములు పోవును. తర్వాత ఆత్మ నిజస్వరూపమున నుండును.

అవ. బహిర్ముఖకాలమునందలి ఆత్మస్వరూపము నుపదేశించు చున్నారు.—

## 4. వృత్తిసారూప్య మితరత్ర.

తా. సమాధివలన బహిర్ముఖ మైన (యోగములేని దశయం దుండు) కాలమునందు ఆత్మ వృత్తులయొక్క సమానస్వరూపమును బొంది యుండును.

వి. యోగములేని దశ వ్యుత్థానదశ. అట్టి కాలమున వృత్తులు కలుగును. చిత్తము గుణపరిణామభేదముచే అంతఃకరణములయందును, ఇంద్రియములద్వారా వెలుపల నానా విషయములయందును ప్రవర్తించును. అప్పుడు చిన్మాత్రుఁ డైన పురుషుఁడు ఆ చిత్తమువంటి ఆకారముగల వాఁడుగా భావింపఁబడును. అనఁగా దుఃఖ మోహ (అజ్ఞాన) సుఖరూపములుగా వృత్తులు గలిగినవెంటనే పురుషుఁడు ఆ దుఃఖాదులే స్వరూపముగాఁ గలవాఁడుగా వ్యవహరింపఁబడును. ఎట్లనఁగా. చంద్రుఁడు కదలుచుండు నీటియలలయందు కనఁబడునప్పుడు ఆ చంద్రుఁడు యేప్రకారముగా అలలవలె కదలుచుండునట్లు తోఁచుచున్నాఁడో, అట్లే చిన్మాత్రుఁ డైన పురుషుఁడు భావింపఁబడుచున్నాఁడు.

అవ. చిత్తవృత్తులను గురించియు, తద్భేదములను గురించియు చెప్పుచున్నారు.—

5. వృత్తయః పఞ్చతయ్యః క్లిష్టాఽక్లిష్టాః.

తా. క్లేశములు కలవియు, క్లేశములు లేనివియు నగు చిత్తవృత్తు లైదు విధములు.

వి. వృత్తులనఁగా, చిత్తపరిణామ విశేషములు. క్లేశములకు (దుఃఖములకు) కారణములై యుండునవి క్లిష్టములు. అక్లేశములకు (సుఖములకు) కారణములై యుండునవి అక్లిష్టములు. వీనిని గురించి విశేషముగా సాధనపాదము మూఁడవసూత్రమునందు వివరింపఁబడును.

అవ. చిత్తవృత్తివివరణమును చెప్పుచున్నారు.—

6. ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః.

తా. వృత్తులు ప్రమాణవృత్తి, విపర్యయవృత్తి, వికల్పవృత్తి, నిద్రావృత్తి, స్మృతివృత్తి, అని ఐదువిధములు.

వి. ఇచ్చటఁ గొందఱు స్వప్నవృత్తిని చెప్పలేదని శంకపొడముదురు. స్మృతివృత్తిలో స్వప్నవృత్తి చేరి యున్నదని గ్రహింపవలయును. వృత్తి యనఁగా, చెఱువులోని నీళ్లు తూమునుండి చౌకముగను త్రికోణముగను మళ్లపాదులయందు పాఱినప్పుడు, ఏలాగు ఆయాయాకారములు గలవిగా నిలిచియుండునో, అట్లే తేజోరూపమైన అంతఃకరణము చక్షురాదీంద్రియములద్వారా ఘటాదివిషయములయందు ప్రసరించి ఆ ఘటాద్యాకారములుగా పరిణమించును. అదియే వృత్తి యనఁబడును. 12-వ సూత్రముయొక్క విశేషార్థమును జూడుఁడు.

అవ. ప్రమాణవృత్తి స్వరూపమును నిరూపించుచున్నారు.—

7. ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని.

తా. ప్రత్యక్షము, అనుమానము, ఆగమము (శబ్దము) అని ప్రమాణములు మూఁడువిధములు.

వి. ఇతరప్రమాణముల సహాయము లేకయే మొదట తెలియకయుండునట్టియు, విషయాకారమై పరిణమించునట్టియు, చిత్తవృత్తి ప్రత్యక్ష ప్రమాణ మనంబడును. అనఁగా, ఇంద్రియములద్వారా వెలుపలివస్తువులతో సంబంధించుటచేత కలుగు విశేషములను నిశ్చయించుటయే ప్రత్యక్షము. ఇదియే ప్రధానమైన వృత్తి.

ప్రత్యక్షమూలకముగా నూహింపఁబడు కారణమైన వస్తువుయొక్క ఆకారమై పరిణమించు చిత్తవృత్తి అనుమానప్రమాణ మనంబడును. అనఁగా, ఒక్క గుఱుతునుబట్టి దానితో సంబంధించియున్న వస్తువును ఊహించుట అనుమానము. ఈ గుఱుతు. "లింగ" మనఁబడును, ఊహింపవలసినది "లింగి" యనఁబడును. ఎట్లన :—

పర్వతముమీఁద పొగ కనఁబడినది. ఆ పొగయే లింగ మనఁబడును. ఊహించునట్టి అగ్గియే లింగి యనఁబడును.

యోగ్యవాక్యముచేతను, నిశ్చయమును చెప్పెడివాని మాటచేతను, శ్రుతిస్మృత్యాది ప్రమాణములచేతను దెలిసిన చిత్తవృత్తి ఆగమ (శాబ్ద) ప్రమాణ మనఁబడును.

ప్రమాణ మనఁగా, బాధింపఁబడని జ్ఞానము, ఎట్లన, వెండిని చూచిన మీఁద వెండియే యనుట ప్రమాణము. ఇది యేకాలమునఁగాని బాధింపఁ బడదు. ముత్తెపుచిప్పను చూచి వెండి యనుట అప్రమాణము. ఇది ఉత్తరకాలమున బాధింపఁబడును. మఱికొందఱు ఉపమానాదిప్రమాణముల నీశాస్త్రిమునందు తెలియఁజేయలేదని భ్రమింతురు. ప్రత్యక్షప్రమాణములలోఁ జేరి యుండుటచే వేఱుగాఁ జెప్పలేదని తెలియఁదగినది.

అవ. విపర్యయవృత్తిలక్షణమును బోధించుచున్నారు.

౮. విపర్యయో మిథ్యాజ్ఞాన మతద్రూప ప్రతిష్ఠమ్.

తా. లేకయుండు వస్తువుయొక్క రూపమునందు ఆ వస్తువు ఉన్న దనెడు మిథ్యాజ్ఞానము విపర్యయవృత్తి యనఁబడును.

వి. ముత్తెపుచిప్పను చూచి వెండి యనుకొనుట విపర్యయము- అనఁగా, తాను తెలిసికొనిన రూపమునందు, తాను అనుకొన్న ప్రకారము లేకపోయినను, తా ననుకొన్న ట్లున్నదని యెంచుకొనునట్టి మిథ్యాజ్ఞానమే విపర్యయవృత్తి. మఱియు నిట్లే కంబమును చూచి ఇది కంబమా మనుష్యుఁడా యని కలిగెడు సంశయజ్ఞానముకూడ విపర్యయ మనఁబడును.

అవ. వికల్పవృత్తి లక్షణము నుపదేశించుచున్నారు.—

9. శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః.

తా. శబ్దమువలనఁ గలిగిన అర్థజ్ఞానముచేత అనుసరింపఁబడినప్పటికిని వస్తువుమాత్రము లేక యుండునది వికల్పవృత్తి యనఁబడును.

వి. విషయము నపేక్షింపక శబ్దజ్ఞానము (అర్థజ్ఞానము) ననుసరించి కలుగుట వికల్పము.

శబ్దజ్ఞానమునకు విషయమై యుండు వస్తువు సంపూర్ణముగా లేక యుండినను, ఆవస్తువు సంపూర్ణమై యున్నదనెడు జ్ఞానము వికల్పజ్ఞానము. ఎట్లన :—

దేవదత్తునియొక్క కంబళి, రాహువుయొక్క శిరస్సు పురుషుని యొక్క చైతన్యము, అనునివి మొదలగునవి. దేవదత్తునియొక్క కంబళి అను నప్పుడు దేవదత్తుఁడు వేఱు, కంబళి వేఱు అని భేదమును తెలియఁజేయును. రాహువుయొక్క శిరస్సు అనునప్పుడు తన ఆకారమంతయు శిరస్సుమాత్రమే అయియుండు రాహువునకు వేఱే శరీరము కల దనెడి జ్ఞానము పుట్టుచున్నది. పురుషునియొక్క చైతన్యము (తెలివి) అనునప్పుడు పురుషుఁడు వేఱు, * తెలివివేఱు అని భేదమును తెలియఁజేయును. ఇదియే వికల్పజ్ఞానము.

* వస్తుస్థితినిబట్టి పురుషుఁడే తెలివిగాని, పురుషునకును తెలివికిని భేదము లేదు. ఇక్కడ శబ్దప్రయోగము ననుసరించి భేదము కలిగిన దని యూహించుకొనునది.

అవ. నిద్రావృత్తిలక్షణమును జెప్పుచున్నారు.—

10. అభావప్రత్యయాలమ్బనావృత్తిర్నిద్రా.

తా. జాగ్రత్స్వప్నావస్థలు లేని జ్ఞానమును ఆశ్రయించి యుండుట నిద్రావృత్తి యనఁబడును.

వి. విషయజ్ఞానమును అవలంబింపని వృత్తియే నిద్ర. భావ మనఁగా విషయము. ప్రత్యయ మనఁగా జ్ఞానము. విషయము, జ్ఞానము అను నీ రెంటి యం దేదియును లేక చిత్తమునకు కలిగెడు వృత్తియే నిద్ర. అభావమనఁగా జాగ్రత్స్వప్నములు లేకపోవుట. ప్రత్యయ మనఁగా కారణమనియు, ఆలంబన మనఁగా విషయ మనియు నెఱుంగునది.

జాగ్రత్స్వప్నములు లేకపోవుటకు కారణమైన తమోగుణోద్రేకము చేత సమస్త విషయానుభవములను విడిచి యుండు సుషుప్తికాలమే నిద్ర యనఁబడును. నేను సుఖముగా నిద్రపోయితి నని నిద్రావస్థను స్మరించుట కలదు. నిద్రపోనియెడల అట్లు స్మరించుటకు అవకాశము కలుగదు. కాఁబట్టి నిద్రకు వృత్తిత్వము సిద్ధించుచున్నది. ఈ నిద్రావృత్తిని యోగమునందు లేకుండఁ జేసికొనవలయును.

అవ. స్మృతివృత్తిని వివరించుచున్నారు.—

11. అనుభూతవిషయాసంప్రమోషః స్మృతిః.

తా. ప్రమాణవృత్తిచే అనుభవింపఁబడిన విషయములు జ్ఞాపకమునకు వచ్చుటయే స్మృతివృత్తి యనఁబడును.

వి. అనాదిగా అనేక జన్మములయందును. ఈ జన్మమునందును ప్రత్యక్ష ప్రమాణములచే అనుభవింపఁబడిన విషయమును చిత్తమునందు వాసనా (సంస్కార) రూపకమై యుండి బుద్ధికి యెదురుగా వచ్చుట (బుద్ధియందు పట్టియుండుట) స్మృతి యగును. అనఁగా మనము ఒక పదార్థమును చూతుము. దానిని చూచినది మొదలు, మఱచిపోవునంతవఱకు అది మన చిత్తమున నాటి

యుండును. ఆ పదార్థమును తలంచినప్పుడు అది జ్ఞప్తికి వచ్చును. ఇదియే స్మృతివృత్తి.

పైన వివరింపఁబడిన పంచవృత్తులలో ప్రమాణము, విపర్యయము, వికల్పము అను మూఁడు వృత్తులను జాగ్రదవస్థ యనఁబడును.

ఈ మూఁడు వృత్తులలోని విషయములు అనుభవబలముచేత చిత్తమందు వాసనారూపకమై యుండి, స్మృతిరూపమై బుద్ధికి గోచరించుట స్వప్నావస్థ యనబడును.

ఈ వృత్తులు మూఁడును బుద్ధికి గోచరము కాక యుండుటయే నిద్రావస్థ (సుషుప్త్యవస్థ) యనఁబడును.

(ప్రమాణ వికల్ప నిద్రలను పట్టియుండునది స్మృతి (తలంపు) అని యెఱుంగునది. ఈ స్మృతి ప్రమాణ విపర్యయ వికల్పనిద్రలయొక్క వాసనాజన్యమై, జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడు మూఁడవస్థలయందు నుండును.

అవ. వృత్తినిరోధమును బోధించుచున్నారు.—

12. అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః.

తా. అభ్యాస వైరాగ్యములచేత, ఇదివఱకుఁ జెప్పఁబడిన చిత్తవృత్తులను నిగ్రహించుటయే నిరోధ మనఁబడుచున్నది.

వి. అభ్యాస వైరాగ్యములచేత సుఖదుఃఖమోహ రూపమైన ప్రపంచానుభవమును కలుగఁజేయు వృత్తులను, అవృత్తులకు కారణమైన చిత్తమందు లయ మొందించుటయే చిత్తవృత్తినిరోధ మనఁబడుచున్నది. అభ్యాసముచేత వృత్తులయొక్క విముఖత స్థిరపడును.

వృత్తి యనఁగా, బుద్ధి ఆయా యింద్రియములలో నుండి వెలుపల ప్రసరించుట. ఇట్లు ప్రసరింపనీయక పోయినయెడల వృత్తులు అంతర్ముఖములై తమకు కారణ మగు చిత్తమునందు శక్తి (సూక్ష్మ) రూపముగా నుండును. విషయములయందుండు దోషాదులను కనుఁగొనుటవలన పుట్టెడి

వైరాగ్యముచేత విషయములలోఁ దగులనీయక విముఖత నొందించును. అభ్యాసమువలన చిత్తమును స్థిరముగా నుండునట్లు దృఢీకరింపఁజేయును. కాఁబట్టి చిత్తవృత్తినిరోధము (1) అభ్యాస (2) వైరాగ్యము లను నీ రెంటిచేతనే కలుగు నని తెలియఁ దగినది.

అవ. అభ్యాస స్వరూపమును దెలియపఱచుచున్నారు.—

13. తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః.

తా. చిత్తవృత్తులను లయింపఁజేయుటకును, చిత్తైకాగ్రతను కలుగఁజేయుటకును, ప్రయత్నపడునట్లు చేయుట అభ్యాస మనఁబడును.

వి. ఏవృత్తులును లేని చిత్తము స్థిరముగా నుండుటయే స్థితి. చిత్తము స్థిరముగా నుండుటకై యత్నము చేయుచుండుటయే అభ్యాసము. అనఁగా, చిత్తవృత్తులు లయమై, చిత్తస్వరూపనిష్ఠ మైన పరిణామము (ఏకాగ్రత) కలుగుటయందు ఉత్సాహముచే పదేపదే ప్రయత్నించుట అభ్యాస మని భావము.

అవ. అభ్యాసముయొక్క దార్ఢ్యమును నిరూపించుచున్నారు.—

14. స తు దీర్ఘకాలనైరన్తర్యసత్కారసేవితో దృఢభూమిః.

తా. ఆ యభ్యాసము బహుకాలమువఱకును యెడతెగక ఆదరాతిశయముతో సేవింపఁబడినయెడల దృఢమైన దశ (స్థిరమైన అవస్థ) కలుగును.

వి. ఉత్సాహముతో చాలకాలము విడువక సత్కారములను (బ్రహ్మచర్యము మొదలుగాఁ గల తపస్సులను) చేయుటవలన, అభ్యాసము స్థిర (దృఢ) పడును. స్థిర మనఁగా, విషయములవలని కలఁతను త్వరగా చెందకుండుట. దీనిని దార్ఢ్య మనియుఁ జెప్పవచ్చును.

అవ. వైరాగ్యస్వరూపమును వివరించుచున్నారు —

15. దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్య|

తా. ఇహమునందును, పరమునందును, అనుభవింపఁదగిన విషయములయందు ఆశ లేనివానికి విషయములు తనకు వశమైన దని తెలియుటయే వైరాగ్యము.

వి. స్రక్చందనవనితాది భోగవిషయములను ఇహమునందును, శ్రుతి (వేదము) వలన తెలియఁబడిన రంభాదిభోగవిషయములను పరమ (స్వర్గము) నందును, అభిలషింపకుండుట వైరాగ్యము.

దృష్టవిషయము లనఁగా :— స్త్రీ సంభోగము, అన్నపానములు, ఐశ్వర్యము మొదలగు ఐహికసంబంధమైనవి. అనుశ్రవ మనఁగా :— వేదముల వలన తెలియవచ్చు స్వర్గాదిలోకాంతరములయందు అనుభవింపఁదగిన ఆముష్మికసంబంధమైనవి. ఇవి దీర్ఘకాలము ననుభవింపనది కాదు. కావున వీనియందలి ఆశను విడువవలయును. (అనఁగా వీనికి వశుఁడు గాక యుండవలయును) ఇట్లు విడిచినవారికి వైరాగ్యము కలుగును. అనఁగా, ఐహికాముష్మిక భోగంబులు తుచ్ఛంబు లనియును. కొంతకాలమే యుండునవి కావున అశాశ్వతం బయినవి యనియును తెలిసి వర్జించినవాఁడే విరాగి యని భావము.

అవ. వైరాగ్యస్వరూపముయొక్క విశేషమును చెప్పుచున్నారు.—

16. తత్పరం పురుషఖ్యాతే ర్గుణవైతృష్ణ్యమ్.

తా. త్రిగుణములయందలి యాశ లేకుండుటయే గుణవైరాగ్యము. ఇది పైని చెప్పఁబడిన విషయవైరాగ్యములకంటె ఉత్కృష్టమైనది.

వి. చిన్మాత్రుఁడైన పురుషునకు (తన ఆత్మస్వరూపము నెఱింగినవానికి) ఇహపరసంబంధముచేఁ గలుగు విషయవైరాగ్యము కంటెను, ఈవిషయములకు కారణమై యుండు సత్త్వాదిగుణములవలనఁ గలుగు గుణవైరా

ర్యము అసంప్రజ్ఞాతసమాధికి అతిసమీపమునం దుండి అనుకూలము నౌసంగు
ంబట్టి శ్రేష్ఠమని చెప్పఁబడెను.

అనఁగా, ఐహికాముష్మికములయందలి దోషముల నెఱింగినవాఁడు
న స్వరూపమును కనుఁగొనుటకు ప్రయత్నించును. ఇట్లు త్రిగుణములకును,
న స్వరూపమునకును గల భేదమును తెలిసికొనుటవలన వైరాగ్యముకలుగును.
దియే గుణవైరాగ్యము. దీనివలన ముక్తి కలుగును.

అవ. ఇట్లు యోగస్వరూపమును నిరూపించి యోగభేదములను వివ
ంచుటకొఱకై ప్రథమున సంప్రజ్ఞాతసమాధిని చెప్పుచున్నారు.

17. వితర్కవిచారానన్దాస్మితారూపానుగమాత్సంప్ర
జ్ఞాతః.

తా. వితర్కమనియు, విచారమనియు, ఆనందమనియు, అస్మిత
మనియు చెప్పఁబడు సమాధులతోఁ గూడిన సమాధి, సంప్రజ్ఞాతసమాధి యనఁ
బడుచున్నది.

వి. సవితర్క, సవిచార, సానంద, సాస్మితయనియుఁ గలదు. సంప్ర
జ్ఞాత మనఁగా:—దేనిచే సంశయ విపర్యయములు లేక ధ్యానించువస్తువు
యొక్క విశిష్టస్వరూపము విశేషముగాఁ దెలియఁబడుచున్నదో, అది సం
ప్రజ్ఞాతసమాధి యనఁబడుచున్నది. సమాధి యనఁగా:—భావనావిశేషము,
భావనావిశేషమనఁగా—ఇతర విషయములను పరిహరించి భావింపఁదగిన
వస్తువును మాత్రమే అప్పటప్పటికి చిత్తమునందు నిల్పుట (అనఁగా భావింపఁ
దగిన వస్తువునకు వ్యతిరిక్తమై చిత్తమందు కలిగెడి వృత్తులను నిగ్రహించుట.)
ఆభావనకు గుఱియైన వస్తువు భావ్య మనఁబడును. (అనఁగా భావింపబడు
నదియే భావ్యము.) ఈ భావ్యము రెండువిధములు. 1 ఈశ్వరుఁడు,
2 ఇరువదైదు తత్త్వములు. ఈ తత్త్వములు రెండువిధములు. 3 అజడ
తత్త్వములు, 4 జడతత్త్వములు. అజడతత్త్వములు చిన్మాత్రులైనపురుషులు

(జడతత్త్వములు స్థూలసూక్ష్మకారణ భేదమువలన ఇరువదినాల్గు విధములు. పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, అను పంచమహాభూతము లును, త్వక్కు, చక్షు, శ్రోత్రము, జిహ్వ, నాసిక అను, పంచజ్ఞానేంద్రియ ములును, వాక్కు, పాణి, పాదము, వాయువు, ఉపస్థ అను పంచకర్మేం ద్రియములును, ఇవి పదునైదును స్థూలభూతములు. శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అను పంచతన్మాత్రలును, మనస్సు, బుద్ధి, అహం కారము, ప్రకృతి అను అంతఃకరణ చతుష్టయమును అను నీ తొమ్మిదియును సూక్ష్మవిషయములు. ఈ 11-ను జడతత్త్వములు.

సవితర్క మనఁగా :—స్థూలభూతములను లక్ష్యము (గుఱి) చేసికొని వీనియొక్క శబ్దార్థజ్ఞాన శోధనభేదముచేత, వీనిలో దేనినుండి యేది పుట్టిన దను కార్యకారణ భావములను విమర్శించుచుండుటయే సవితర్క సమాధి యనఁబడును.

అనఁగా, స్థూలములగు భూతంబులను యింద్రియంబులను విషయ ములుగాఁ జేసికొని, ఇది ముందు ఇది వెనుక అను జ్ఞానముతోడను, దీని కిది పేరు అనెడు శబ్దార్థజ్ఞానముతోడను చేయునట్టి భావనయే సవితర్కము. (పైని చెప్పఁబడినట్టి జ్ఞానము ఎంతవఱకు లేకయుండునో అంతవఱకు నిర్వితర్కమని తెలియవలయును.)

మొట్టమొదట వింటితో గుఱిని వైవ నభ్యసించువాఁడు గొప్పగా కనఁ బడునట్టి గుఱిని వైవనేర్చికొని తర్వాత సూక్ష్మమైన గుఱిని వైవ నేర్చికొను చున్నాఁడు. ఆ ప్రకారముగనే యోగాభ్యాసి మొదట స్థూలాకారమైన వస్తువును (విష్ణువు, శివుఁడు, బ్రహ్మ మొదలగువారి ఆకారములను) భావన చేయుచు ఆమీఁద సూక్ష్మాకారమైన వస్తువును (విషయమును) గూర్చి భావన చేయును.

సవిచార మనఁగా:—పంచతన్మాత్రలు మొదలగు సూక్ష్మవిషయ ములను గుఱి జేసికొని ఇవి ఏకాలమునందు ఏస్థలమునందు ఏ స్వరూపమైన

ధర్మము గలదిగా కలిగెనని యేర్పాటుతో భావించి యుండుటయే సవిచార సమాధి యనఁబడును. (పైని చెప్పిన చొప్పున భావింపమి నిర్విచార మనఁ బడును.)

సానంద మనఁగా:—చిత్తమునందు రజస్తమోగుణములు నిశ్శేషముగా నశించిపోక లేశమాత్రము (కొంచెము) మిగిలియుండు కాలమునందు ఆ చిత్తమం దుండు సత్త్వగుణము (అంతఃకరణ సత్త్వమును) భావించుచుండుటయే సానందసమాధి యనఁబడును. (సత్త్వము- సుఖప్రకాశరూపమైనది కావున సానంద మనఁబడెను.) ఈ సానందసమాధియందు రజస్తమోగుణములలేశము నశించిపోఁగా తాను భావన చేయుటలో (భావించునట్టి) సత్త్వగుణము వృద్ధి యగుచుండుటంబట్టి ఆనందము కలుగుచున్నది. (ఇంద్రియము లనెడు స్థూలవిషయములను గూర్చినది సానందము.) ఈ సానందసమాధిని చక్కఁగా నభ్యసించి ప్రధానము, పురుషుఁడు అను తత్త్వముల తెలివిలేశమాత్రమును లేనివారు విదేహు లనఁబడుదురు.

సాస్మిత యనఁగా :—రజస్తమోగుణములతో సంబంధింపక యుండు చిత్తమునందు శుద్ధసత్త్వమును మాత్రము భావించి యుండుటచేత సత్త్వగుణము క్రమక్రమముగా నశించిపోవుటవలనను, చిత్తమందలి చైతన్యశక్తి క్రమక్రమముగా వృద్ధి యగుచుండుటవలనను, చైతన్యశక్తిమాత్రమే మిగిలి యుండును గాన సాస్మితసమాధి యనఁబడును.

అస్మిత యనఁగా:—బహిర్ముఖమందు అజ్ఞానముచేఁ గలుగు క్లేశరూపకమైన అస్మిత యని గ్రహింపక అంతర్ముఖమందు కలుగు అక్లేశ (ఆనంద) రూపక మైన అస్మిత యని గ్రహింప వలయును. అస్మితవలన ఇంద్రియములు కలుగును కావున, ఇంద్రియములకు అస్మితయే సూక్ష్మరూపము.

---

మఱియు, ఆత్మతోఁ గూడ బుద్ధికి ఐక్యమును తెలియపఱుచునట్టి జ్ఞానమే అస్మిత యనఁబడును. దీనిలో గ్రహీత యగు నాత్మయు చేరియుండుటచే నిది గ్రహీతృవిషయ మని గ్రహింపవలయును. అహంకారమునకును

అస్మితయను భేదము లేమనఁగా, అంతఃకరణము నే నను జ్ఞానముతో నే విష యములను గ్రహించుట అహంకారము. అంతఃకరణము అంతర్ముఖ మైన ప్పుడు సత్తు (స్థితి) మాత్రము తోఁచుట అస్మిత యనఁబడును.

ఈ సాస్మితసమాధివలన కలుగు సంతోషముతో తృప్తిని బొంది పర మాత్మను కనుఁగొననివారితలంపు దానికి కారణమైన ప్రకృతియందు లయ మును బొందును; కావున వారు ప్రకృతిలయు లనఁబడుదురు.

ఇందు సవితర్కము సవిచారము అను రెండు సమాధులు గ్రాహ్య సమాపత్తి యనియును, సానందము గ్రహణసమాపత్తి యనియును, సాస్మిత గ్రహీతృసమాపత్తి యనియును చెప్పఁబడును.

ఈ నాలుగువిధముల సమాధులయందును, సవితర్కమును త్యజించి నచో సవిచారమును, సవిచారమును విడిచినచో సానందమును, సానంద మును వదలినచో సాస్మితయును కలుగును.

ఈ సమాధులు నాలుగింటిని సాలంబనాసమాధి యనియును, సంప్ర జ్ఞాతసమాధి యనియును నామములు గలవు.

ఇందు సవితర్క సవిచారములు రెండును సబీజసమాధి యని చె ప్పఁబడును.

సబీజసమాధి యనఁగా. చిత్తము అన్యపదార్థముల నాశ్రయించి కొని యుండుట. వీని వివరమును 42, 43, 44 సూత్రములయందుఁ జెప్పఁబడును.

అవ. అసంప్రజ్ఞాత సమాధిలక్షణమును వచించుచున్నారు.—

18. విరామ ప్రత్యయాభ్యాస పూర్వ స్సంస్కార శేషో ఽన్యః.

తా. వితర్కము మొదలు అస్మితాంతములవఱకు గల సంప్రజ్ఞాత సమాధులు లేకపోవుటయు, చిత్తమునందు వృత్తులు తలచూపినను వానిని రానీయక నిరాకరించుటయు, నిర్మలమైన చిత్ప్రకాశమార్గమువలన

చిన్మాత్రుఁడైన పురుషుని స్వరూపమై యుండుటయు అసంప్రజ్ఞాతసమాధి యనఁబడును.

౨. ఈ సమాధియందు తెలియఁదగిన పదార్థములు లేవు గాన అసంప్రజ్ఞాత మను పేరు కలిగినది. దీనినే నిర్బీజసమాధి యనియు వ్యవహరింతురు.

అనఁగా, చిత్తమునందు వృత్తులు జనించినప్పుడు వానిని నిగ్రహించుటకు ప్రయత్న పడవలయును. ఈ అసంప్రజ్ఞాత సమాధియందు విషయమే యుండదు.

చిత్తమునకు వ్యుత్థానము. సమాధిప్రారంభము. ఏకాగ్రత, నిరోధము అని నాలుగు పరిణామములు కలవు. రెండవసూత్రమున వివరింపఁబడిన క్షిప్త మూఢములు రెండును వ్యుత్థానము. విక్షిప్తభూమిలో సత్త్వగుణము అతిశయించి యుండుటంబట్టి దానిని సమాధిప్రారంభ మనఁబడెను. నాల్గవభూమి ఏకాగ్రత. నిరుద్ధభూమి నిరోధము. ఇవి ఒకదానివలన మఱియొకటి తొలఁగద్రోయఁబడును.

ఎట్లనగా. వ్యుత్థానముచే జనించిన సంస్కారములను సమాధి ప్రారంభముచేఁ బుట్టిన సంస్కారములు పోఁగొట్టును. సమాధి ప్రారంభముచేఁ గలిగిన సంస్కారములను యేకాగ్రతవలనఁబుట్టిన సంస్కారములు తొలఁగించును ఏకాగ్రతచే జనించిన సంస్కారములను నిరోధమునుండి కలిగిన సంస్కారములు నిగ్రహించును. నిరోధముచేఁ గలిగిన సంస్కారములుమాత్రము యేకాగ్రతవలనఁ బుట్టిన సంస్కారములను పోఁగొట్టుచు అవియు పోవుచున్నవి.

ఇందులకు దృష్టాంత మెట్లనఁగా:— వెండితో సీసమును జేర్చి పూఁదినయెడల వెండిలోనుండు మలినమును పోఁగొట్టి అదియును (సీసమును) పోవునట్లు అని తెలియఁదగినది. ఈ అసంప్రజ్ఞాతసమాధికి ఉత్తమవైరాగ్యమే కారణము.

౨౦. యోగాభ్యాసమునకు ఉపాయమును జెప్పువారై సానంద సాస్మిత సమాధులయందుండువారి స్వరూపమును నిరూపించుచున్నారు.—

## 19. భవప్రత్యయో విదేహప్రకృతిలయానామ్.

తా. విదేహులయొక్కయు ప్రకృతిలయులయొక్కయు సమాధి జననమరణప్రవాహరూపమైన సంస్కారమునకుఁ గారణ మైనది.

వి. భవప్రత్యయమనఁగా:— పంచభూతములు, ఇంద్రియములు అను వికృతితత్త్వములయందైనను, లేక అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు అను ప్రకృతితత్త్వములయందైనను, (పైన చెప్పినవియెల్లను ఆత్మతత్త్వము కాకున్నప్పటికిని) ఆత్మ యనెడి తలంపును, అందుచే జనించిన యోగమును భవప్రత్యయ మనఁబడును. ఈ భవప్రత్యయము విదేహులకును, ప్రకృతిలయులకును కలుగును.

విదేహు లనఁగా:— సానందసమాధియం దుండువారు. వీరు ప్రధానపురుషరూప మైన తత్త్వమును తెలియనివారై, శుద్ధసత్త్వగుణ పరిణామమునందే ఆనందము నొందియుండుటం బట్టి దేహాహంకారములు లేనివారై యుందురు.

అనఁగా:— పంచభూతములు, ఇంద్రియములు, వీనిలో నొక్కక దానిని ఆత్మ యని భావించి వానినే యుపాసన (భావన) చేయువారికి. ఆవాసన అంతఃకరణమున పట్టియుండును. కావున వారు శరీరమును విడిచిన తర్వాత పంచభూతములలో నైనను, లేక ఇంద్రియములలో నైనను లయమునుబొంది సంస్కారములతోమాత్ర మున్నట్టి మనస్సుకలవారై యీ భౌతికశరీరము లేనివారై యుందురు. ఇట్టివారే దేవతలు వీరి చిత్తమునందు సంస్కారములతోఁ గూడినవార మనెడి తలంపుమాత్ర ముండునేగాని వృత్తులేవియు కలుగవు. వీరు కొన్నాళ్లు దేవతలై యుండి మరల సంసృతిని (సంసారమున) ప్రవేశింతురు. కాఁబట్టి వీరికి మోక్షము లేదు. భూతముల నుపాసించువారు నూఱు మన్వంతరములును. ఇంద్రియముల నుపాసించువారు పదిమన్వంతరములును దేవతలుగా నుందురు. వీరే విదేహు లనఁబడుదురు.

ప్రకృతిలయు లనఁగా :— సాస్మిత సమాధియం దుండువారు. వీరును పరమాత్మను దర్శింపనివారై శుద్ధసత్త్వగుణమును విడిచి చిత్ప్రకాశము నందు నిలిచి ఆనందమయులై యుందురు. వీరి చిత్తము స్వకారణ మైన ప్రకృతియందు లీనమై యుండును. కావున విదేహప్రకృతిలయులయొక్క యోగమును ఆభాసమైనదే పరమాత్మను దర్శించువారు సత్త్వాదిగుణముల యం దాశను విడిచి వైరాగ్యమువలన అసంప్రజ్ఞాతిసమాధిద్వారా కైవల్య పదవిని చెందవలయును. అనఁగా, ముక్తిని గోరువాఁడు పరతత్త్వము నెఱింగి దానినే యుపాసన (భావన) చేయుటకు మిక్కిలి ప్రయత్నము చేయ వలయును.

అనఁగా :— అవ్యక్తతత్త్వము, మహత్తత్త్వము, అహంకార (అభిమాన) తత్త్వము, పంచతన్మాత్రలు, వీనిలో నొక్కొకదానిని ఆత్మగా భావించి యుపాసన చేయుటవలన ఆవాసనవైన చెప్పిన అవ్యక్తాదులలో నొక్కదాని వాసన అంతఃకరణమునందు పట్టియుండును. ఇట్లు అవ్యక్తాదులలో మనస్సు లీనమై యుండువారు శరీరమును విడిచినకాలమునందు ముక్తిని యనుభవించు చున్నట్లు తలంచి యుందురు. ఇందువలన శాశ్వతమైన కైవల్యప్రాప్తి సిద్ధింపదు. ఎట్లనఁగా, వర్షాకాలము పోయినమీఁద మన్నైపోయిన కప్ప మఱల వర్షము కురిసినవెంటనే యెట్లు కప్పయగుచున్నదో, అలాగే అవ్యక్తాదులలో మనస్సు లీనమై యుండువారు మఱల సంసారు లగుదురు. అవ్యక్తతత్త్వమును ఉపాసించువారు లక్షమన్వంతరములును, మహత్తత్త్వమును ఉపాసించువారు పది వేలమన్వంతరములును, అహంకారతత్త్వమును ఉపాసనచేయువారు వేయి మన్వంతరములును కైవల్యము ననుభవించువారివలెనుండి మఱల సంసారులగుదురు. వీరే ప్రకృతిలయు లనఁబడుదురు.

అవ. విదేహప్రకృతి లయవ్యతిరిక్తులైన యోగులు యోగసిద్ధికొఱకు విశేషప్రయత్నమును జేయవలయు ననుచున్నారు.

20. శ్రద్ధావీర్యస్మృతి సమాధి ప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్.

తా. విదేహప్రకృతిలయవ్యతిరిక్తులైన యోగులయొక్క సమాధి సిద్ధికి శ్రద్ధ, వీర్యము, స్మృతి, సమాధి, ప్రజ్ఞ ఈ మొదలగునవి క్రమమైన యుపాయములు.

వి. భవప్రత్యయమునకు వ్యతిరిక్తమైన ఉపాయప్రత్యయము నీ సూత్రము వలన చెప్పంబడుచున్నది. విదేహులయు ప్రకృతిలయులకు వేఱైన సవితర్క, నిర్వితర్క, సవిచార, నిర్విచార, సమాధులయందుండు యోగులకు సానందసాస్మిత రూపసంప్రజ్ఞాతసమాధిసిద్ధికై యోగమునందు శ్రద్ధయును (విశ్వాసమును), వీర్యమును (ఉత్సాహమును), స్మృతియును (మఱవకయుండుటయును), సమాధియును (చిత్తైకాగ్రతయును), ప్రజ్ఞయును (వివేకమును), ఇవి క్రమముగా సాధకములై యున్నవి.

ఎట్లనఁగా, యోగమునందు విశ్వాసముకలవానికి చేయుదు ననెడు ఉత్సాహము కలుగుచున్నది. ఉత్సాహమువలన యోగమును, మఱవక యుండుట కలుగుచున్నది. యోగమును మఱవకయుండుటవలన చిత్తైకాగ్రత కలుగుచున్నది. చిత్తైకాగ్రతవలన యోగమును తెలిసికొను వివేకము కలుగుచున్నది.

ఇవి యొకదానికొకటి కారణములై సంప్రజ్ఞాతసమాధిని (ప్రజ్ఞను) కలుగఁజేయును. ఈ సంప్రజ్ఞాతసమాధిని అభ్యసించుటవలనను, వాని విషయమునందలి వైరాగ్యమువలనను, అసంప్రజ్ఞాతసమాధి సిద్ధించును. ఇదియే ఉపాయప్రత్యయ మనఁబడును.

అవ. శీఘ్రకాలమున సమాధి సిద్ధించునట్టి యధికారమును నిరూపించు చున్నారు.—

## 21. తీవ్రసంవేగానా మాసన్నః.

తా. తీవ్రమైన సంవేగము (జాగరూకతరమైన దృఢతరసంస్కారములు) కలవారలకు సంప్రజ్ఞాతసమాధి మిగుల సమీపము.

వి. సంవేగ మనఁగా:—కార్యసాధక మైనట్టి మిక్కిలి దృఢమైన (వైరాగ్యము) సంస్కారము. ఉపాయప్రత్యయసంపత్తి మిక్కుటముగ కలవారలకు యోగమును, దానిఫలమును, శీఘ్రముగా లభించును. ఉపాయ సంపత్తికలవారలే తీవ్రసంవేగు లనఁబడుదురు.

అవ. దృఢతరసంస్కారభేదములను వచించుచున్నారు.—

## 22. మృదుమధ్యాధిమాత్రత్వా త్తతో ఽపి విశేషః ॥

తా. యోగులు మృదువులు, మధ్యములు, అధికులు అని వ్యవహరింపఁబడుదురు. ఈ మృదు మధ్యాధికు లొకరికన్న నొకరు విశేషజ్ఞులు కావున తీవ్రసంవేగులకన్న వెక్కువారు.

వి. మృదూపాయులు, మధ్యోపాయులు, అధిమాత్రోపాయులు, అని యోగులు మూఁడువిధములవారు. ఈ ముగ్గురును ప్రత్యేకప్రత్యేకముగా మృదుసంవేగులు, మధ్యసంవేగులు, తీవ్రసంవేగులు అని మూడువిధముల వారు. కాఁబట్టి యోగులు తొమ్మిదివిధములవా రగుదురు. ఎట్లన,

మృదుసంస్కారభేదము కలవారు:—మృదుమృదుసంవేగులు, మృదు మధ్యసంవేగులు, మృద్వధిమాత్రసంవేగులు.

మధ్యసంస్కారభేదము కలవారు:—మధ్యమృదుసంవేగులు, మధ్య మధ్యసంవేగులు, మధ్యాధిమాత్రసంవేగులు.

అధిమాత్రసంస్కారభేదము కలవారు:—అధిమాత్ర మృదుసంవేగులు, అధిమాత్రమధ్యసంవేగులు, అధిమాత్రాధిమాత్రసంవేగులు.

అనఁగా:—మృదుసంవేగ మృదూపాయము కలవాఁడు, మధ్యసంవేగ మృదూపాయము కలవాఁడు, తీవ్రసంవేగ మృదూపాయముకలవాఁడు, మృదు సంవేగ మధ్యోపాయము కలవాఁడు, మధ్యసంవేగ మధ్యోపాయము కల వాఁడు, తీవ్రసంవేగ మధ్యోపాయము కలవాఁడు, మృదుసంవేగాధిమాత్రో పాయము కలవాఁడు మధ్యసంవేగాధిమాత్రోపాయము కలవాఁడు, తీవ్ర

సంవేగాధి మాత్రోపాయము కలవాఁడు అని యోగి నవవిధ భేదములు గల వాఁడుగా నున్నాఁడు తీవ్రసంవేగాధిమాత్రోపాయము కలవాఁ డగుటకు దగిన ప్రయత్నములను చేయవలయు ననుటకై యోగులు తొమ్మిది విధముల వారని చెప్పఁబడెను.

అవ. పైని చెప్పిన యుపాయములకంటె సులభ మైనదానిని చెప్పు చున్నారు.—

## 23. ఈశ్వరప్రణిధానా ద్వా.

తా. ఈశ్వరోపాసకుఁడు, విధ్యుక్తకర్మలాచరించి భక్తితో సమస్తమును ఈశ్వరార్పణ మని చేయునేని వానికి శీఘ్రగా యోగము సిద్ధించును.

వి. ఈ యీశ్వరోపాసనాయోగము సులభోపాయ మైనది.

ప్రణిధాన మనఁగా:—భక్తివిశేషముతోఁ గూడిన యుపాసనము. విషయములవలనఁ గలుగు సుఖము నిమిత్తమై కర్మము లాచరింపక సర్వ కర్మములను ఈశ్వరునకు సమర్పింపవలయును. ఇది యోగము లభించుట కును దానిఫలము సిద్ధించుటకును గొప్ప యుపాయము. ఈ భక్తి మానసిక, కాయిక, వాచిక మై యుండును.

అవ. ఈశ్వరప్రణిధానమువలన సమాధిలాభము సులభముగాఁ గల్గు నని చెప్పి, యిఁక నా యీశ్వరుని స్వరూపమును, ఈశ్వరుఁడు కలఁడను టకుఁ బ్రమాణమును, ఈశ్వరుని మాహాత్మ్యమును, ఈశ్వరుని తెలియఁజేయు శబ్దమును, ఈశ్వరుని యుపాసించుక్రమమును, ఈశ్వరోపాసనవలని ప్రయోజనమును క్రమముగాఁ జెప్ప నుపక్రమించి యిప్పుడు ఈశ్వరస్వరూ పమును జెప్పుచున్నారు.—

## 24. క్లేశకర్మ విపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః.

తా. అవిద్యాది క్లేశములు, పుణ్యపాప మిశ్రకర్మములు, జాత్యా యుర్భోగములు, చిత్తమునందు వాసనారూపమై యుండు సంస్కారములు

అను వీనిచేతను కాలత్రయములచేతను బాధింపఁబడని పురుషశ్రేష్ఠుఁడు ఈశ్వరుఁ డనఁబడును.

వి. క్లేశము లనఁగా:— అవిద్య మొదలగునవి. (వీనిని రెండవ పాదమునందలి 3-వ సూత్రమునఁ గనఁదగును.)

కర్మము లనఁగా:— విహితము, నిషిద్ధము, మిశ్రము అని మూఁడు విధములు.

విహితకర్మము లనఁగా:— సంధ్యావందనాదులు.

నిషిద్ధకర్మము లనఁగా:— పరహింస మొదలగునవి.

మిశ్రకర్మము లనఁగా:— పుణ్యపాపములు రెండింటితోఁడ సంబంధించినవి.

విపాక మనఁగా:— పైని వివరించిన కర్మములకు ఫల మగుజాతి, ఆయువు, భోగములు. (వీనిని ద్వితీయపాదము 13-వ సూత్రమున చూడఁదగును.)

ఈశ్వరుఁ డనఁగా:— మీఁదఁ జెప్పఁబడిన క్లేశాదులచే సంబంధపడియు కట్టువడక యుండువాఁడు.

అవ. ఈశ్వరునియొక్క ప్రమాణమును జెప్పుచున్నారు.—

## 25. తత్ర నిరతిశయం సర్వజ్ఞ బీజమ్.

## (సార్వజ్ఞ్యబీజమ్) అని పాఠాంతరము.

తా. ఆ యీశ్వరునియందు సర్వజ్ఞుఁ డనుటకుఁ దగిన హేతువు కలదు. కాన ఈశ్వరుఁ డున్నాఁ డనుటకు ముఖ్యప్రమాణ మున్నది.

వి. ఈశ్వరుఁడు సర్వజ్ఞత్వమునకు బీజము (కారణము) అని చెప్పినందున ఆయనకంటె మఱి వేఱొకరియుఁ లేదని యేర్పడెను. ఈశ్వరునియందే సర్వజ్ఞత్వమును నిరూపించుటకుఁ గారణ మే మనఁగా, స్వతః జడమైన

చిత్తమునందు ఆత్మప్రతిన్యాభివ్యక్తివలన జ్ఞానాద్యుత్తమమైన సర్వధర్మములను హెచ్చుగను తక్కువగను మలినముగను నిర్మలముగను ఇట్లు వ్యత్యాసములు గలవిగా పరిణమించుటంబట్టి వీనికి కారణుం డొకఁడున్నాఁడనియును, అతనిచేతనే యిట్లు కలుగుచున్నదనియును తెలియఁబడుచున్నది. కావున, నిరతిశయ (అంతకంటె మఱి అతిశయించినది లేనిది, లేక అత్యధికమైనది) జ్ఞానశక్తి ఈశ్వరునియందే యున్నదనియును, అతఁడే మూలభూతుఁడనియును విశద మగుచున్నది.

అవ. ఈశ్వరుని మాహాత్మ్యము జెప్పుచున్నారు.—

26. సర్వేషా మపి గురుః కాలే నానవచ్ఛేదాత్.

"(స ఏష పూర్వేషా మపి" అనియును, "స పూర్వేషా మపి" అనియును) పాఠాంతరములు.

తా. ఆ యీశ్వరుఁడు త్రికాలాబాధ్యుం డగుటచే బ్రహ్మాదు లగు వారికిని గురువు (ఉపదేశకర్త)గా నున్నాఁడు.

వి. త్రికాలము లనఁగా:— భూతకాలము (జరిగిపోయిన కాలము) భవిష్యత్కాలము (జరుగఁబోవు కాలము,) వర్తమానకాలము (జరుగుచుండు కాలము,) ఈశ్వరుఁడు ఈ కాలములవలన బాధింపఁబడఁడు. ఎల్లప్పుడు నుండువాఁడు గాన నాతనికి కాలము నిర్ణయము లేదు, కాఁబట్టి అప్పుడప్పుడు జనన మొందు బ్రహ్మాదులకు ధర్మముల నుపదేశించువాఁడుగా నున్నాఁడు.

అవ. ఈశ్వరోపాసనకొఱ కతని నామమును జెప్పుచున్నారు.-

27. తస్య వాచకః ప్రణవః.

తా. ఆ యీశ్వరునకు ఓంకారమే (ప్రణవము) నామధేయము.

వి. ఈశ్వరుఁడు "ఓమ్" అని చెప్పఁబడును. ఓమ్ అనునదే ప్రణవము. ప్రణవ మనఁగా, అందఱిచేతను స్తోత్రము చేయఁబడునది; లేక దీనిచే

నీశ్వరుఁడు స్తుతింపఁబడును. లేక, ఈశ్వరుని యిది అధికముగా స్తుతి చేయును. అనఁగా:—ఒకఁడు తండ్రియును ఒకఁడు కొడుకు నై నప్పుడు, ఇతఁడు ఈతనికి తండ్రి యనియును, ఇతఁడు ఈతనికి కుమారుఁడనియును చెప్పునట్టి సంబంధ (అకల్పిత మైన నిత్యసంబంధ) మెట్టిదో, అట్లే ఈశ్వరునకును ప్రణవమునకును గల నిత్యసంబంధమును తెలిసికొనవలయును.

అవ. ఈశ్వరోపాసనాక్రమమును జెప్పుచున్నారు.—

28. తజ్జప స్తదర్థ భావనమ్.

తా. మూఁడున్నర మాత్రలగల ఓంకారమును జపము చేయుటయు, ఆ ఓంకారముయొక్క అర్థమును భావించుటయు ఉపాసన యనఁబడును.

ఓ. ఓంకారముయొక్క మూఁడున్నరమాత్ర యేదనఁగా:—అ-ఉ-మ-అర్ధమాత్ర. ఇవి చేరిన ఓంకారమును పదేపదే చింతించుట జప మనఁబడును.

ఓంకారార్థమును భావించుట యనఁగా:—ఓంకారార్థ ప్రదుఁడైన ఈశ్వరుని ధ్యానము చేయుట. అనఁగా, యోగమును చేయుచు ప్రణవము నుచ్చరింపవలయు ననియును ప్రణవము నుచ్చరించుచు యోగము నాచరింపవలయు ననియును భావము. ప్రణవజపము చిత్తైకాగ్రతకు ఉపాయము కనుక సమాధిసిద్ధికై యోగు లవశ్యము దీనిని జపింపవలసినది. ఇందువలన పరమాత్మ ప్రకాశించును.

అవ. ఈశ్వరోపాసనా ఫలమును జెప్పుచున్నారు.

29. తతః ప్రత్యక్చేతనాధిగమో ఽప్యన్తరాయా ఽభావశ్చ.

తా. ఆ ఈశ్వరునిఁ జెప్పెడి ఓంకారజపమువలన చిన్మాత్రుఁడైన పురుషునియొక్క విఘ్నములు తొలఁగును; జ్ఞానము లభించును.

వి. తనకంటె వేఱైన ఈశ్వరుని ధ్యానము చేయుటవలన ఆత్మసాక్షాత్కార మెట్లు కలుగు ననఁగా, ఈశ్వరస్వరూపమువలె ఆత్మస్వరూపమునై యుండుటంబట్టి ఈశ్వరోపాసనవలన ఆత్మస్వరూపము తెలియఁబడును.

అవ. యోగవిఘ్నము లైన అంతరాయములను జెప్పుచున్నారు.—

30. వ్యాధి స్త్యాన సంశయ ప్రమాదాలస్యావిరతి భ్రాన్తిదర్శనాలబ్ధభూమికత్వానవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తేఽన్తరాయాః.

తా. రోగములు, యోగకర్మాసమర్థత, సందేహము, అజాగ్రత్త, మత్తత, అతృప్తి, భ్రమ, సమాధిస్థితి కుదురుక పోవుట, చిత్తస్థైర్యము లేకుండుట అను నీ చిత్తవికారములు యోగవిఘ్నము లనఁబడును.

వి. వాత పిత్త శ్లేష్మాదిధాతువైషమ్యముచే గలుగు జ్వరాదివ్యాధులును, అంగపాటవముతప్పి చిత్తము పనిచేయుటకు దగియుండని కర్మాసమర్థత యనెడు స్త్యానమును, యోగము సాధ్య మగునో కాదో యను సంశయమును, యోగము నాచరింపక ఉదాసీనతతో నుండుట యనెడు అజాగ్రత్త ప్రమాదమును, చిత్తమును దేహమును మదించి యేమియు తోఁపక మత్తగా నుండు ఆలస్యమును, విషయసుఖాదులయందు తృప్తి జెందని అవిరతియును, యోగమునందు భ్రమ జెందియుండు భ్రాంతిదర్శనమును, ఏవో కారణాంతరములవలన యోగము కలుగకపోవుట యను అలబ్ధభూమికత్వమును, సమాధిస్థితి కలిగినను దానియందు నిలుకడలేకపోవుట యనెడు అనవస్థితత్వమును అను నీతొమ్మిదియును చిత్తైకాగ్రతకు విరోధములు గాన ఇవి చిత్తవిక్షేపము లనియును, అంతరాయము (విఘ్నము) లనియును చెప్పఁబడెను.

అవ. మఱికొన్ని అంతరాయములను వక్కాణించుచున్నారు.—

31. దుఃఖ దౌర్మనస్యాఙ్గమేజయత్వ శ్వాస ప్రశ్వాసా విక్షేప సహభువః.

తా. దుఃఖము, దౌర్మనస్యము, అంగమేజయత్వము, శ్వాసము, ప్రశ్వాసము అనునవి చిత్తవిక్షేపములకు (సహకారులు) తోఁబుట్టువులు.

వి. దుఃఖ మనఁగా:— అనుతాపముచేఁ గలిగిన చిత్తక్షోభము. ఈ దుఃఖము ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అని మూఁడువిధములు. ఈ ఆధ్యాత్మికము శరీరము, మానసము అని రెండువిధములు; శారీరము జ్వరము మొదలగునవి. మానసము కామము మొదలగువానిచేఁ గలుగునవి. ఆధిభౌతికము పులులు మొదలగువానిచేఁ గలుగునవి. ఆధిదైవికము పిశాచము మొదలగువానిచేఁ గలుగునవి.

దౌర్మనస్య మనఁగా:— బాహ్యాభ్యంతర కారణములచేతఁ గాని, కోరిక యీడేరక పోవుటచేతఁగాని, మనస్సు నిలుకడ లేక చంచలముగా నుండుట.

అంగమేజయత్వ మనఁగా:— ఆసనము (కూర్చుండుట,) మనస్సు, స్థిరముగా నిలువక సర్వావయవములు వడఁకుచుండుట.

శ్వాస మనఁగా:— వెలుపలిగాలిని దేహములోపలికి నెక్కువగా పీల్చుకొనుట. ఇదే ఉచ్ఛ్వాసము.

ప్రశ్వాస మనఁగా:— దేహములోపలి గాలిని యెక్కువగా బయట విడుచుట. ఇదే నిశ్శ్వాసము.

అవ. చిత్తవిక్షేపనివారణార్థమైయుతరోపాయమును జెప్పుచున్నారు.—

## ౩౨. తత్ప్రతిషేధార్థ మేకతత్త్వాభ్యాసః.

తా. ఆ చిత్తవిక్షేపముల యొక్క నివారణముకొఱకు తనకు ఇష్టమైన ఏకతత్త్వమును అభ్యాసము చేయవలయును.

వి. తనకు అభిమత మైనట్టి యేదేని యొక తత్త్వాభ్యాసమువలన చిత్తవిక్షేపములను నివర్తింపవలయును. అనఁగా, ఒకతత్త్వమునందు మనస్సును నిలుపుటకు అభ్యసింపవలయును.

బౌద్ధమతమున చిత్తము క్షణిక మని చెప్పఁబడి యున్నది. క్షణిక మనఁగా, క్షణక్షణమునకు ఒక్కొక్క చిత్తము కలుగు చుండుట. అట్లనుట వలన అదియును అయోనిజ్ఞయములను గురించిన జ్ఞానమే గాని వేఱు కాదు. కావున బౌద్ధుని (వైనాశికుని) మతప్రకారము చిత్తమునకు నేకాగ్రతతప్ప విక్షేప మనునది లేకపోవుచున్నది. ఇదికాక స్థిరమైన చిత్తము నంగీకరింపని యెడల, ఒకవస్తువును చూచుచున్న నేను దానిని తాఁకు చున్నాను అని, చూచుటకును తాఁకుటకును సాధన మైన ఒక చిత్తము గలిగి యున్నట్లు కలుగు అనుభవమునకు విరోధము కలుగుచున్నది. కావున బౌద్ధమతమునఁ జెప్పిన చిత్తము క్షణిక మనునది ఖండింపఁబడియెను.

అవ. చిత్తసంస్కారము నొసంగునట్టి బాహ్యపరికర్మము లైన వేఱే యుపాయములను జెప్పుచున్నారు.

33. మైత్రీ కరుణా ముది తోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాఽపుణ్యవిషయాణాంభావనా తశ్చిత్త ప్రసాదనమ్.

తా. సుఖము, దుఃఖము, పుణ్యము, పాపము (అపుణ్యము,) అనువానిని గురించిన మైత్రి (స్నేహము), కరుణ (దయ), ముదిత (సంతోషమున), ఉపేక్ష (ఉదాసీనము), అను నీవృత్తులను భావన చేయుటవలన చిత్తమునకు స్వేచ్ఛ (ప్రసాదనము) కలుగుచున్నది.

వి. మైత్రి యనఁగా:—సుఖించుచున్న సాధువులయందు మిత్రభావము నవలంబింపవలయును.

కరుణ యనఁగా:—దుఃఖించుచున్న వారియందు కనికరము వహింపవలయును.

ముదిత యనఁగా:—పుణ్యము కలవారిని చూచి సంతోషపడవలయును.

ఉపేక్షయనఁగా :—పాపులయందు ఉదాసీనుఁడై యుండవలయును.

ఇట్లనఁగా, సుఖవంతులనుజూచి అసూయపడఁగూడదు. దుఃఖవంతులను జూచి ఉపేక్షతో నుండరాదు. పుణ్యవంతులయెడ ద్వేషము చేయఁదగదు. పాపులయొక్క పాపములను జూచి అనుమోదింపరాదు. మఱియు వారితో ద్వేషమును వహింపరాదు.

ఇట్లు ద్వేషరాగాదులకు ప్రతికోటులైన (విరోధులైన) మైత్ర్యాదులను భావముచేయుటచేత (మైత్ర్యాద్యాచరణవలన) చిత్తము ప్రసన్నమై సంప్రజ్ఞాతసమాధుల కుపయుక్తమగును, అనఁగా, రాగద్వేషాదులే చిత్తవిక్షేపములను కలుగఁజేయుచున్నవి. మైత్ర్యాదులమూలముగా ఆరాగాదులను నిర్మూలము చేయఁగు. అట్లు చేయుటచేత చిత్తము ప్రసన్నమైయేకాగ్రతను బొందును.

అవ. చిత్తైకాగ్రతకొఱకు అన్యోపాయమును వచించుచున్నారు.—

## 34. ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా ప్రాణస్య.

తా. ప్రాణవాయువును (ఊపిరిని) విడుచుటచేతను, నిలుపుటచేతను (రేచక పూరక కుంభకములచేతను), చిత్తైకాగ్రత (చిత్తస్థైర్యము) కలుగును.

వి. ప్రచ్ఛర్దన మనగా :—లోపలి యూపిరిని ప్రమాణముచొప్పున విడుచుట, ఇదే రేచకము.

విధారణ మనఁగా :—లోపలివాయువును వెలుపలికి ప్రసరింపనీయక పట్టియుంచుట ; ఇదే కుంభకము. ఇది వెలుపలివాయువును లోపలపూరించి దానిని నిల్పుటచే నైనను, క్రొత్తగా పూరింపక అప్పటికున్న ఊపిరిని మాత్రము పట్టుటచేనైనను కలుగును. వీనిలో వెలుపలిగాలిని లోపలికి పూరించుటను పూరక మని చెప్పఁబడును. (కుంభకములో పూరకము చేరియుండుటవలన పూరకమును గుఱించి సూత్రమున చెప్పఁబడలేదు.) ఈ మూఁడును ప్రాణాయామ మనఁబడును. దీనివలన చిత్తమునకు స్థిరత్వము కలుగును.

మఱియు ప్రాణాయామము నాడిని శుద్ధి చేయును. సకలదోషము లను పోఁగొట్టును. దీనివలన చిత్తైకాగ్రత కలుగు నని చెప్పుటవలన 83-వ సూత్రమున జెప్పిన మైత్ర్యాదులనువదలి ప్రాణాయామమునుమాత్రము చేసిన చాలు నని యెంచక యీరెంటిని అవలంబింపవలయును. (ఈ విష యము 2-వ పాదము 49-సూత్రమున వివరింపఁబడును).—

అవ. సంప్రజ్ఞాత సమాధికి పూర్వము చిత్తస్థైర్యమును కలుగఁజేయు వేఱొయుపాయమును జెప్పుచున్నారు.—

35. విషయవతీ వా ప్రవృత్తిరుత్పన్నా స్థితి నిబన్ధినీ.

తా. శబ్దాదివిషయములవలనఁ గలుగు ప్రవృత్తి యైనను చిత్తస్థైర్య మును కలుగఁజేయును.

వి. యోగాభ్యాసి నాసాగ్రమునందు (ముక్కుకొనయందు) చిత్త మును నిల్పునేని దివ్యగంధజ్ఞానమును; జిహ్వాగ్రమందు (నాలుకకొనయందు) చిత్తమును నిల్పునేని దివ్యరసజ్ఞానమును, తాలుమూలమందు (దౌడయందు) చిత్తమును నిల్పునేని దివ్యరూపజ్ఞానమును; జిహ్వామధ్యమందు (నాలుక నడుమ) చిత్తమును నిల్పునేని దివ్యస్పర్శజ్ఞానమును; జిహ్వామూలమందు (నా లుకఅడుగున) చిత్తమును నిల్పునేని దివ్యశబ్దజ్ఞానమును కలుగును. అనఁగా, ఈ అభ్యాసమువలన చిత్తైకాగ్రత కలుగును.

అవ. మీఁద వివరించునట్టి చిత్తస్థైర్యమునకొఱకు వేఱొక యుపాయ మును వచించుచున్నారు.

35. విశోకా వా జ్యోతిష్మతీ.

తా. రజస్తమోగుణములచేఁ గలుగు దుఃఖము (శోకము) లేని సాత్త్వికప్రకాశావలోకనమువలన, సకలవృత్తులును లయమై చిత్తము స్థిరముగా నుండును.

వి. విశోకా=శోకములేనిది; జ్యోతిష్మతి=మంచిజ్యోతి, అనఁగా, సత్త్వగుణ సంబంధి యైన ప్రకాశము.

హృదయకమలమధ్యమందు అలలు లేని క్షీరసముద్రమువలె నుండు చిత్తముయొక్క సత్త్వమును భావన చేయుటవలనఁ గలుగు తేజస్సువలన (సాత్త్వికప్రకాశాలోకనముగలవ) వృత్తు లన్నియును నశించును. అందు వలన చిత్తమునకు స్థైర్యము కలుగును.

అవ. ఉపాయాంతరమును బోధింపనెంచి తత్ప్రయోజన మైన అసంప్రజ్ఞాతసమాధియొక్క లక్ష్యమును వచించుచున్నారు.—

37. వీతరాగవిషయం వా చిత్తమ్.

తా. లోక వ్యాపారములయం దాశయును. ఆ వ్యాపారముల భావనయును లేని చిత్తము స్థైర్యమును బొందును.

వి. విషయాదులయందు అభిలాషయును, వాని జ్ఞాపకమును చిత్తమునకు రానీక చేయునట్టి వారి చిత్తము యేకాగ్రముగా నుండును. ఇది అసంప్రజ్ఞాతసమాధికి కారణ మైన యుపాయము గాన నిర్విషయక మైన చిత్తమే ఆ సమాధికి సాధక మగును. మఱియు వేదవ్యాసుఁడు మొదలగువారు విషయాదులయం దభిలాష లేనివారు. ఇట్టివారి చిత్తమును భావన చేయుటవలన భావన చేయువారి చిత్తము వేదవ్యాసాదులవంటి దగు నని చెప్పఁబడి యున్నది.

అవ. పైని వివరించిన దానినిగూర్చి వేఱువిధముగాఁ జెప్పుచున్నారు.—

38. స్వప్ననిద్రాజ్ఞానాలమ్బనం వా.

తా. స్వప్నజ్ఞానమునుగాని, నిద్రా (సుషుప్తి) జ్ఞానమును గాని, భావనచేసెడి చిత్తము స్థైర్యముగా నుండును.

వి. స్వప్న మనఁగా:— బాహ్యేంద్రియముల వ్యాపారములు లేక మనోమాత్రముచేతనే విషయానుభవము (సుఖదుఃఖానుభవము) కలుగు

యున్నదో, యీ యవస్థ స్వప్నము. అనఁగా:—స్వప్నమందు నిర్జనప్రదేశమునం దతిరమ్యమైన మహేశ్వరస్వరూపమును (విగ్రహమును) గాంచి మేల్కాంచి ఆ స్వరూపమును భావన చేయుటచేతను చిత్తస్థైర్యము కలుగును.

స్వప్నమువలె నుండు అభ్యాసముచేత సంప్రజ్ఞాతసమాధికిని, సుషుప్తివలె నుండు అభ్యాసముచేత అసంప్రజ్ఞాతసమాధికిని సాధక మగు నని తెలియవలయును.

నిద్రపోయి లేచినతర్వాత తనకు సుఖముగా నిద్రపట్టినదని యెప్పుడు తోఁచునో, యీనిద్ర సాత్త్విక నిద్ర. అట్టి సమయమున చిత్తము స్థైర్యముగా నుండును.

(నిద్రాస్వరూపమును ఈ పాదమునందే 10-వ సూత్రమునఁ జెప్పంబడియెను.)

అవ. యోగికి యిష్టవస్తు ధ్యానముచేతను చిత్తస్థైర్యము కల్గునని చెప్పుచున్నారు.—

## 39. యథాభిమతధ్యానా ద్వా.

తా. తనకు ఇష్టమైన వస్తువును ధ్యానము చేయుటవలనను చిత్తమునకు స్థైర్యము కలుగును.

వి. లోకమునందు మనుజులకు అనేకవిధములైన వాసన లుండుటంబట్టి యోగి యగువానికి యే వస్తువునందు వాసన యధికముగనుండి దానిపై శ్రద్ధ కలిగి యున్నదో, ఆ వస్తువును ధ్యానము చేసినను చిత్తమునకు స్థైర్యము కలుగును.

అనఁగా:— వెలుపలివస్తువు లగు చంద్రాదులనుగాని, లోపలివస్తువు లగు నాడీచక్రాదులనుగాని, భావనచేయుటవలన చిత్తైకాగ్రత కలుగును. సహజముగా తన కిష్టమైన వస్తువు శివ, రామ, కృష్ణాది రూపములుగానే

నుండును. గాన అట్టి స్వరూపధ్యానమువలన చిత్తము స్థిరమై యుండు నని భావము.

అవ. చిత్తస్థైర్యమువలన ప్రయోజనమును వచించుచున్నారు.—

**40. పరమాణు పరమమహత్త్వాన్తో ఽస్యవశీకారః.**
**(పరమహత్త్వాన్తో ఽస్య) అని పాఠాంతరము.**

తా. మున్ను వివరించిన ఉపాయములచేత చిత్తము స్థైర్యము నొంది యుండువానికి పరమాణువు మొదలు శ్రేష్ఠమైన మహత్తత్త్వము (బుద్ధి తత్త్వము) వఱకును వశీకారము (కలుగుచున్నది.)

వి. వశీకార మనఁగా:— అడ్డుబాటులేక గోచరించుట. చిత్తస్థైర్యము కలవానికి అతిసూక్ష్మ మగు పరమాణువు మొదలగు పరమమహత్తులగు ఆకాశాదులవఱకును చిత్తవృత్తి అడ్డుబాటులేక ప్రవర్తించును. సూక్ష్మతత్త్వములు పరమాణువు లనియును, స్థూలతత్త్వములు ఆకాశాది బుద్ధి తత్త్వ పర్యంత మనియును తెలియఁదగినది.

అవ. ఇంతవఱకు చెప్పఁబడిన యుపాయములచేత నిర్మలమైనట్టి చిత్త స్వరూపముయొక్క లక్షణమును జెప్పుచున్నారు.—

**41. క్షీణవృత్తే రభిజాతస్యైవమణే ర్గ్రహీతృ గ్రహణ గ్రాహ్యేషు తత్స్థతదఞ్జనతా సమాపత్తిః.**
**(అభిజాత స్యైవ) అని పాఠాంతరము.**

తా. వృత్తులన్నియు నశించిపోయిన చిత్తము ఆత్మయందును, ఇంద్రియములయందును, విషయములయందును కూడి యున్నప్పటికిని, దాని వలెనే యుండుట సమాపత్తి (సమాధి). ఇది నిర్మలమైన స్ఫటికమణివలె నుండును.

వి. గ్రహీత యనఁగా:— ఆత్మ (పురుషుఁడు).

గ్రహణ మనఁగా:— ఇంద్రియములు.
గ్రాహ్యము లనఁగా:— విషయములు.

సూత్రమున వివరింపఁబడిన క్రమము అవివక్షితముగాఁ దోఁచినను దానిని యీ విధముగా నన్వయించుకొనఁదగును. ప్రథమమున గ్రాహ్యము లయిన విషయములయందే యోగము (సమాధి = సమాపత్తి) కలుగును. తర్వాత గ్రహణము లయిన ఇంద్రియములయందు చిత్తము కలుగును. ఆ మీఁద గ్రహీత యైన ఆత్మయందు సమాధి కలుగును. అనఁగా, ప్రథమము ననే ఆత్మను భావన చేయుటకు సాధ్యము కాదని భావము.

దీనికి దృష్టాంతముగా స్ఫటికమణిని చెప్పఁబడెను. అనఁగా, స్ఫటికమణి యేరంగుగల వస్తువుతోఁ జేరుచున్నదో, ఆరంగుగలదిగాఁ గనఁబడును. అట్లే వృత్తులు లయించిన యోగియొక్క చిత్తము నిర్మలమై యుండుకారణమునుబట్టి చిన్మాత్రుఁడైన సాక్షిపురుషునియందుగాని, ఇంద్రియముల యందుగాని, శబ్దాదివిషయములయందుఁగాని చేరియుండునప్పుడు ఆయా వస్తువులవలె నుండును.

చిత్తవృత్తులు క్షయించినమీఁద భావన చేయునట్టి వస్తువువలె చిత్తమునకు పరిణామము కలుగును. ఇదియే సంప్రజ్ఞాతసమాధి యనఁబడును. (ఈ విషయము ఈపాదము 17-వ సూత్రమున చెప్పఁబడియున్నది.)

అవ. సంప్రజ్ఞాతసమాధిభేద మైన సవితర్కసమాధిలక్షణమును చెప్పు చున్నారు.—

42. శబ్దార్థజ్ఞానవికల్పైః సంకీర్ణా సవితర్కా.
(తత్ర శబ్దార్థజ్ఞాన) అని పాఠాంతరము.

తా. శబ్దము, అర్థము, జ్ఞానము, వికల్పము, వీనియొక్క కూటవి సవితర్కసమాధి యనఁబడును.

వి. తత్ర అనఁగా:—ఆ సమాధులు నాలుగింటిలో అని యర్థము

శ్రోత్రేంద్రియ గ్రాహ్య మైనది శబ్దము. ఆ శబ్దముయొక్క వివేచన అర్థము. ఆ యర్థమువలన కలుగునది జ్ఞానము. ఆజ్ఞానము వేరొక విధముగా భేదములేక తెలియుట వికల్పము. "విప్రః" అనునది శబ్దము. ఈ శబ్దమునకు వేదపాఠకుఁడు (బ్రాహ్మణుఁడు) అనునది అర్థము. బ్రాహ్మణుఁ డని తెలియుట జ్ఞానము. ఇట్లు శబ్దముతో అర్థమునకును జ్ఞానమునకును గూడ వికల్పము (అభేదము) కనఁబడుచున్నది. అభేదజ్ఞాన ముండునప్పుడు కలుగునదే సవితర్క్కసమాధి. మనచెవికి వినఁబడు ధ్వనివలన సూచింపఁబడెడు స్ఫోట మనెడు నిత్యశబ్ద మొకటి కలదని వైయాకరణులు చెప్పెదరు. ఇచ్చట శబ్దము ఏదిగా నున్నను బాధలేదు.

(ఈ పాదము 17-వ సూత్రమున సమాధులు నాలుగింటి వివరము చెప్పఁబడియున్నది.)

అవ. నిర్వితర్క్కసమాధిని చెప్పుచున్నారు.—

43. స్మృతి పరిశుద్ధౌ స్వరూపశూన్యే వార్థమాత్ర నిర్భాసా నిర్వితర్కా.

తా. తాను ధ్యానించు చుండు శబ్దార్థజ్ఞానముల వికల్పము పోయి, మఱియు ఆవస్తువుయొక్క శబ్దార్థజ్ఞానముల జ్ఞాపకమే లేక, అధ్యానవస్తువు మాత్రము అభిముఖమైయుండుట నిర్వితర్క్కసమాధి యనఁబడును.

వి. అనఁగా:—శబ్దార్థముల తలంపు పోయినమీఁద తన స్వరూపము లేనట్లు విషయముమాత్రము స్ఫురించును. ఇదే నిర్వితర్క్కము. ఇట్లనఁగా తాను ధ్యానించుచుండు వస్తువుమాత్రమే ప్రకాశించునని భావము.

విషయ మనఁగా:—ఘటము, గోవు మొదలగు వస్తువులు.

బౌద్ధులమతమున పరమాణువుల సముదాయము ఘటాది పదార్థము లనియును, వేఱువస్తువు లేదనియును చెప్పఁబడి యున్నది. ఇది సరికాదు, ఎట్లనఁగా, పరమాణువులే ఘట మని చెప్పఁగా అభేదమును, పరమాణువుల

వలన ఘటము గతిగిన దని చెప్పుటవలన భేదమును గలుగుచున్నది. గాన ఘటమునకును పరమాణువులకును తాదాత్మ్యము కల దని తెలియందగినది.

అవ. సవిచార నిర్విచార సమాధిలక్షణములను జెప్పుచున్నారు.—

**44. ఏతయైవ సవిచారా నిర్విచారా చ సూక్ష్మవిషయా వ్యాఖ్యాతా.**

తా. స్థూలవిషయకము లైన సవితర్క నిర్వితర్కసమాధుల నిరూపణమువలన సూక్ష్మవిషయకములు గల సవిచార నిర్విచార సమాధులు వివరింపఁబడెను.

వి. ఇదివఱకుఁ జెప్పఁబడిన సవితర్క నిర్వితర్క సమాధులు స్థూలవిషయకములు. సవిచార నిర్విచార సమాధులు సూక్ష్మవిషయకములు. తక్కినవి యెల్లను సమానములుగా నుండును.

ఎట్లనఁగా:—పృథివ్యాది పంచమహాభూతములును, దశేంద్రియములును స్థూలభూతములు. ఈ స్థూలభూతముల శబ్దార్థజ్ఞానవికల్పములు గలది సవితర్కసమాధి యగుచున్నది. శబ్దార్థజ్ఞానవికల్పములు లేని స్థూలభూతములు మాత్రము గలది నిర్వితర్క సమాధి యగుచున్నది.

సూక్ష్మవిషయము లైన తన్మాత్రలైదును, అంతఃకరణమును లక్ష్యము చేసికొని ఇవి, ఎప్పుడు, ఎక్కడ, ఎట్లుపుట్టిన దనెడు విమర్శనముతో భావించుట సవిచారసమాధి యగుచున్నది.

ఇవి, ఎప్పుడు, ఎక్కడ, ఎట్లుపుట్టినది, అనెడి విమర్శనము లేక వానినిమాత్రము భావించుట నిర్విచారసమాధి యగుచున్నది.

అనఁగా:—సూక్ష్మవస్తువులు అప్పటిది, ఇప్పటిది, దీని కిది పేరు, అని యిట్లు దేశ, కాల, నామ, నిర్దేశముతో భావించుట సవిచారసమాధి యని

యును; అట్లు భావింపక సూక్ష్మవస్తువులుమాత్రము స్ఫురించెడు సమాధి నిర్విచారసమాధి యనియును తెలియఁదగినది.

సూక్ష్మవిషయము లనఁగా:—పంచతన్మాత్రలవలనఁ గలిగెడు పరమాణువులు.

అవ. సూక్ష్మవిషయములయొక్క అవధిని చెప్పుచున్నారు.—

45 సూక్ష్మవిషయత్వం చాలిఙ్గ పర్యవసానమ్.

తా. సూక్ష్మవిషయము లనునది ప్రధానతత్త్వమును (అలింగమును) వఱకుఁ గలది.

వి. గుణముల పరిణామములచేఁ గలుగు తత్త్వములు విశిష్ట లింగ మనియును అవిశిష్టలింగ మనియును, లింగమాత్ర మనియును, అలింగ మనియును నాల్గు విధములు.

విశిష్టలింగ మనఁగా:—పంచమహాభూతములు.

అవిశిష్టలింగ మనఁగా:—దశేంద్రియములును, పంచతన్మాత్రలును.

లింగమాత్ర మనఁగా:—బుద్ధితత్త్వము.

అలింగ మనఁగా:— ప్రధానతత్త్వము. ఈ ప్రధానతత్త్వమునకంటె సూక్ష్మమైన విషయము లేదు.

మఱియు లింగ మనునది యెప్పటికిని లయమొందనిదియును, ఎచ్చటికిని పోనట్టిదియు నని భావము.

పరమాణువులకంటెను తన్మాత్రలు సూక్ష్మములు. వానికంటెను అహంకారతత్త్వము సూక్ష్మము. దానికంటెను మహత్తత్త్వ మనెడు బుద్ధితత్త్వము సూక్ష్మము. మహత్తుకంటెను ప్రధానము (అలింగము) సూక్ష్మము. కావున దానికంటె సూక్ష్మమైనది మఱి యేదియును లేదు.

అవ. సవితర్క నిర్వితర్క సవిచార నిర్విచార సమాధులయొక్క ఏకవాక్యమును నిరూపించుచున్నారు.—

## 46. తా ఏవ సబీజ స్సమాధిః.

తా. ఇదివఱకుఁ జెప్పిన సవితర్క, నిర్వితర్క, సవిచార, నిర్విచార సమాధులు నాలుగును సబీజసమాధు లనఁబడును.

వి. సబీజ మనఁగా:—ఆలంబనము; లేక సంప్రజ్ఞాతము. అనఁగా విషయమును తాను అనుభవించునట్లు తెలియునట్టి సమాధులు సబీజ సమాధులు.

మఱియు నీ సమాధులలో ఆత్మకును అంతఃకరణమునకును భేదజ్ఞానము వుండదు కావున, సబీజ సమాధు లనఁబడియెను. బీజ మనఁగా, సంసారబంధముయొక్క బీజ మనియుఁ గలదు.

అవ. నిర్విచార సమాధియొక్క ప్రయోజనమును జెప్పుచున్నారు.—

## 47. నిర్విచారవైశారద్యే ఽధ్యాత్మప్రసాదః.

తా. నిర్విచార సమాధియొక్క అభ్యాసబలము వలన అధ్యాత్మప్రసాదము (బుద్ధికి నిర్మలత్వము) కలుగుచున్నది.

వి. అనఁగా సవితర్కమునకు ఫలము నిర్వితర్కమును, నిర్వితర్కమునకు ఫలము సవిచారమును, సవిచారమునకు ఫలము నిర్విచారమును అగుటంబట్టి నిర్విచారమునకు ఫలము అధ్యాత్మప్రసాద మని చెప్పఁబడినది.

అధ్యాత్మ ప్రసాద మనఁగా:—లోకములో నిదివఱకు జరిగియున్న సకల వ్యాపారములను ఒక్కమాఱు తన ఆత్మలోనే స్ఫురించుట.

వైశారద్య మనఁగా:— నిర్మలత్వము. నిర్మలత్వము కలిగినచో చిత్తమునకు దృఢమైన స్థిరత్వము కలుగును. అప్పుడు ఆత్మయు పరిశుద్ధము గలదై యుండును.

అవ. ఋతంభరప్రజ్ఞా లక్షణమును జెప్పుచున్నారు.—

48. ఋతమ్భరా తత్ర ప్రజ్ఞా.

తా. బుద్ధికి నిర్మలత్వము కలిగినమీఁద యెప్పుడును వికల్పము నొందని సత్యముతోఁ గూడిన ప్రజ్ఞ కలుగును.

వి. అధ్యాత్మ ప్రసాదమువలనఁ గలిగెడు తెలివియే ఋతంభరము. ఋత మనఁగా సత్యము. దానిని భరించునది ఋతంభరము. అనఁగా అసత్యము లేని ప్రజ్ఞ (తెలివి) యని భావము.

అనఁగా:—నిర్మలమైన బుద్ధియందు వికల్పములేని నిజమైన ప్రజ్ఞా విశేషము (ఋతంభరాప్రజ్ఞ) కలవాఁడా ప్రజ్ఞవలన సకల పదార్థముల నిజ స్వరూపమును చక్కఁగా తెలిసికొనెడి శక్తి గలవాఁడై యోగమునందు అత్యుత్తమస్థితిని పొందును.

అవ. ఋతంభరాప్రజ్ఞయొక్క విశేషమును ప్రశంసించుచున్నారు.—

49. శ్రోతానుమాన ప్రజ్ఞాభ్యాం సామాన్య విషయా విశేషార్థత్వాత్. (శ్రుతానుమాన ప్రజ్ఞాభ్యా మన్యవిషయా) అని పాఠాంతరము.

తా. సామాన్యముగా స్థూలవిషయక ప్రజ్ఞలైన ఆగమ ప్రమాణము చేతను, అనుమానప్రమాణముచేతను పుట్టునట్టి ప్రజ్ఞలకంటెను; ఋతంభరాప్రజ్ఞ సూక్ష్మవిషయములయందును, చిన్మాత్రుఁడైన పురుషునియందును గల విశేషములను గోచరింపంజేయును; గాన విలక్షణమైనది.

వి. శ్రుత మనఁగా:—ఆగమ (శబ్ద) ప్రమాణమువలనఁ గలిగెడు జ్ఞానము. అనుమాన మనఁగా:—తెలిసిన దానింబట్టి తెలియని దానిని ఊహించుట. ఆగమువలన సామాన్యములైన స్థూలవిషయముల ప్రత్యక్షమును, అనుమానమువలన భూతసూక్ష్మముల పరోక్షజ్ఞానమును కలుగును.

ఋతంభరా ప్రజ్ఞగలన భూతసూక్ష్మములైన తన్మాత్రములయొక్కయు, అంతఃకరణముయొక్కయు, చిన్మాత్రుఁడైన పురుషునియొక్కయు, విశిష్టస్వరూపస్థితులు ప్రత్యక్షముగా చక్కఁగా తెలియును. అనఁగా సూక్ష్మమైనట్టియు, దూరమునం దుండునట్టియు, దగ్గఱ నుండునట్టియు, సకల వస్తురూపములు విమర్శనముగా తెలియును. కాఁబట్టి శ్రౌతానుమాన ప్రజ్ఞలకంటెను ఋతంభరాప్రజ్ఞ విలక్షణ మైనది.

ఈ ఋతంభరాప్రజ్ఞను తార్కికులు యోగజప్రత్యక్ష మని చెప్పెదరు. ఇది యుక్తప్రత్యక్ష మనియును, యుంజానప్రత్యక్ష మనియును రెండు విధములు. యోగసిద్ధి గలిగినవాఁడు యుక్తుఁడు. యోగాభ్యాసము చేయువాఁడు యుంజానుఁడు. యుక్తునకు కావలసినప్పుడు(1) సకలవస్తువులను (2) గోచరించును. యుంజానునకు సదా సకలవస్తువులును గోచరించు చుండును.

అవ. ఋతంభరా ప్రజ్ఞయొక్క ఫలమును జెప్పుచున్నారు.

50. తజ్జ స్సంస్కారో ఽన్యసంస్కార ప్రతిబన్ధీ.

తా. ఋతంభరా ప్రజ్ఞవలనఁ బుట్టిన సంస్కారము, ఇతరము లైన బహిర్ముఖజ్ఞానముచేఁ బుట్టిన సంస్కారములను నిరోధించును.

వి. ఋతుంభరాప్రజ్ఞ, బహిర్ముఖముచే జనించిన సంస్కారములను నిర్విచారసమాధివలనఁ గలిగిన సంస్కారములను సహా తమ కార్యములను చేయుటకు సామర్థ్యములేని వానినిగాఁ జేయును. అనఁగా, కార్యకారి కాకుండ చేయును. తత్త్వజ్ఞానరూపము లగు సంస్కారములును బలము గలది యగుటచే ఇతర (అజ్ఞానమునలనఁ గల్గిన) సంస్కారములను బాధించును. కాఁబట్టి ఋతుంభరా ప్రజ్ఞను దృఢముగా నభ్యసింపవలయును.

అవ. అసంప్రజ్ఞాతసమాధిలక్షణమును జెప్పుచున్నారు.—

51. తస్యాపి నిరోధే సర్వనిరోధా న్నిర్బీజస్సమాధిః.

తా. ఆ ఋతంభరాప్రజ్ఞకును, సంప్రజ్ఞాతసమాధికిని సహా నిరోధము కలుగఁగా, చిత్తవృత్తులు నశించును. అందువలన నిర్బీజసమాధి కలుగును.

వి. సానందసాస్మితసమాధులను, ఋతంభరాప్రజ్ఞను నిగ్రహించుటచేత, చిత్తమునందు యేవృత్తి కలిగినను దానిని కలుగ నీయదు. అనఁగా సమస్త చిత్తవృత్తులును, స్వకారణమైన చిత్తమందు లయించును. అప్పుడు శుద్ధబుద్ధముక్త స్వరూపమును నిత్యనిరతిశయ మహాకైవల్యస్థితియు నైన పురుషునియొక్క స్వస్వరూపస్థితి కలుగుచున్నది. అనఁగా చిన్మాత్రుఁడైన పురుషుఁడు స్వస్వరూపమున నున్నవాఁ డగుచున్నాఁడు. ఇది జననమరణప్రవాహరూపమైన ఘోరసంసారములోఁ దగులనీయక చేయును; గాన నిర్బీజసమాధి యని చెప్పఁబడెను.

పాతంజల యోగశాస్త్రమునందు

యోగపాదము

సమాప్తము.



ఓం.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# పాతంజలయోగశాస్త్రము.

## ౨. సాధన పాదము.



శ్లో. తే తే దుష్ప్రాపయోగర్ధి సిద్ధయే యేన దర్శితా,
ఉపాయా స్సజగన్నాథ స్సర్వేషో ఽస్తు ప్రార్థితాప్తయే.

అవ. క్రియాయోగస్వరూపమును నిరూపించుచున్నారు.—

1. తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియాయోగః.

తా. కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులును, వేదమంత్రముల జపమును, ఫలాపేక్ష లేక తాను జేయుకర్మముల నీశ్వరున కర్పించుటయును, క్రియాయోగము లనఁబడును.

౨. ప్రథమపాదమున యోగస్వరూపమును, యోగోపాయములను, యోగవిధానములను, సమాహితచిత్తునకు (స్వస్థచిత్తునకు) సబీజ నిర్బీజ సమాధిరూపం బగు యోగమును చెప్పఁబడియె. ఇప్పుడు యోగాపేక్ష గల చపలచిత్తునకు (వ్యుత్థితచిత్తునకు) సాధ్య మెట్లగు నని యాలోచించి యోగమునకు సాధక మైన యీ సాధనపాదమునందు క్రియాయోగముల క్రమము మొదలగువానిని వివరింపఁబడెడిని. తపము చేయుటయైనను ధాతువైషమ్యమును బోఁడమించి చిత్తమును కౌలుష్యరహితము చేయుదగును.

ఎట్లనఁగా:—బంగారమును పుటము బెట్టుట, అందలి దోషమును దొలఁగించుటకు మాత్రమేగాక, బంగారమును భస్మముచేయుటకు గాదు. కాఁబట్టి జాగరూకతతో తపం బొనరింపవలయును.

తప మనఁగా:— శాస్త్రోపదిష్టమైన కృచ్ఛ్రచాంద్రాయణాదులు.

స్వాధ్యాయ మనగా :—ప్రణవపూర్వక మైన మంత్రానుష్ఠానము.

ఈశ్వరప్రణిధాన మనఁగా :—ఓంకారవాచ్యుండైన ఈశ్వరుని ఉపాసించుట. (దీనిని 1-పాదము 26-27-వ సూత్రములను చూడుఁడు).

అవ. క్రియాయోగ ప్రయోజనము వచించుచున్నారు.—

2. సమాధిభావనార్థః క్లేశతనూకరణార్థశ్చ.

తా. పైని చెప్పిన క్రియాయోగము సమాధిస్థితీకరణమునకును, క్లేశములు నశించుటకును వుపయోగ మైనది.

వి. ఈ క్రియాయోగము సమాధిని నిష్పన్న మొనరించి అవిద్యాది క్లేశములను క్షీణింపఁ జేయును. అందువలన నిర్మలసత్త్వ పురుషాఖ్యాతియును, చిత్తైకాగ్రతయును కలుగును. యోగాపేక్ష కల చపలచిత్తు లగు వారెల్లరు నీ క్రియాయోగమును చేయువలయును.

అవ. పంచక్లేశములను నిరూపించుచున్నారు.—

3. అవిద్యాస్మితా రాగద్వేషాభినివేశాః పఞ్చక్లేశాః.

తా. అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అను నీ యైదును క్లేశములు.

వి. క్లేశము లనఁగా :—విపర్యయము లనియును, మిథ్యాదృష్టిరూపము లనియును తెలియునది. (ఈ విషయమును 1 పాదము 7-వ సూత్రమున చూడుము).

అజ్ఞానమనునది అవిద్య; నాకు సంభవించినదికదా యనునది అస్మిత; ప్రపంచసుఖ సాధనారూపమైనది రాగము; తన సంకల్పమునకు కలుగు విఘ్నములను తొలఁగించికొనుటకు బుట్టునది ద్వేషము; సకలలక్షణ సంపన్నతతో జీవింపుచుండవలయు నను ఆశారూపకమైనది అభినివేశము. ఇవి యోగమునకు విఘ్నకారులు. సంసారమును వృద్ధిచేయును; దుఃఖమును కలుగఁజేయును; కావున క్లేశము లనఁబడియెను. అనఁగా, బాధారూపమైన పరితాపమును కలుగఁజేయునది. ఇవి చిత్తమునందు నెలకొని సంసారలక్షణమైన ప్రాపంచికధర్మమును దృఢపఱచును.

అవ. అవిద్యయే క్లేశములకు ప్రధానకారణ మని చెప్పుచున్నారు.—

4. అవిద్యా క్షేత్రముత్తరేషా ప్రసుప్త తనువిచ్ఛిన్నో దారాణామ్.

తా. అవిద్యాదిక్లేశములు పరస్పరము సమానములుగా నున్నను, (నిద్రోపశమన విచ్ఛిన్నోదారములైనను) క్లేశములకు ప్రధాన కారణమైనది అవిద్య యనఁబడును.

వి. నేను నే నని బుద్ధికి అభేదముగా నాత్మనెఱిగించునట్టి అస్మిత యనెడు క్లేశమునకును; సుఖానుస్మృతిచేత నగునట్టి ఆయా వస్తువులయందు గలుగు స్వీకారేచ్ఛారూపంబగు రాగంబునకును; దుఃఖకర మనియెడు అనుస్మృతిచేత ఆయావస్తువులందుఁ గలుగు పరిహారబుద్ధిరూపంబగు ద్వేషంబునకును; ఇఁకను గాఁబోవు యిష్టభంగమరణాదికము ననుసరించి కలుగునట్టి భయరూపం బగు అభినివేశంబునకును; ఆధారమై (జన్మస్థానమై) యుండునట్టిది అవిద్య యనఁబడును.

అనఁగా:—ప్రాణులు బాల్యదశయందు తమతమపనులను చేయుటకు శక్తిచాలక చిత్తమునందు కరుండి నిద్రపోవునట్లుగను, ఆ బాల్యావస్థపోయి యౌవనావస్థవచ్చుట పూర్వస్థితియందుండు ప్రాణులయందు ప్రజ్ఞ గల

శిథిలములు కలిగియుండునట్లును, యోగావస్థయందు ఒకదానిలో నొకటి మిశ్రము గాక తమతమ పనులను చేయుచుండునవిగను, యోగావాంతరావస్థలయందు క్రమముగా వృద్ధి యగు ఉత్కృష్టదశ కలవిగను నుండునట్టి అస్మితము, రాగము, ద్వేషము, అభినివేశము అను వీనికి అవిద్యయే కారణము. ఎట్లన; ప్రాణులయొక్క బాల్యాద్యవస్థలయందు వృద్ధి యగుచు వచ్చుచుండినట్లెల్లను, అస్మిత రాగ ద్వేషాభినివేశములు ఆ యవిద్యయొక్క సహాయబలముచేతనే క్రమక్రమముగా వృద్ధి యగుచు వచ్చుచుండుటవలన తక్కిన క్లేశములకు అవిద్యయే మూలకారణము. కాబట్టి అవిద్యను సమ్యగ్జ్ఞానముచే నివర్తింపఁజేసినచో తక్కిన క్లేశములు పుట్టుటకు అవకాశము లేక పోవును.

మఱియు అసంప్రజ్ఞాత సమాధినిష్ఠులయందు (1) ఈ అవిద్యాదులు దగ్ధబీజములవలె నిర్మూల మగుచున్నవి. సానంద సాస్మిత (2) సమాధినిష్ఠులయందు నిద్రపోవుచున్నవి. సవిచార నిర్విచార సమాధినిష్ఠులయందు (3) శిథిలములు కలవిగా నున్నవి. సవితర్క నిర్వితర్క సమాధినిష్ఠులయందు (4) విరళములై తమ తమ పనులను చేయుచున్నవి. కర్మఠులయందును ఇతరులయందును ఉత్కృష్టస్థితియందున్నవి. గాన, అవిద్యను విడుచుటకు ప్రయత్నింపవలయును. అస్మితాదులు నాలుగింటికిని ప్రసుప్తి, కృశత, విచ్ఛేదము, ఔత్కట్యము అని నాలుగు దశలు కలవు. వీనికిని అవిద్యయే మూలము.

విశేష ప్రకృతిలయులయందు వీనిశక్తితోనే యుండుట ప్రసుప్తి; విరుద్ధముగా భావించుటచేత బలము తగ్గియుండుట కృశత; ఇవి రెండును రోగవశముచేఁ బుట్టిన యవస్థలు క్రోధము కలుగునప్పుడు కామమునకు కలుగుభంగము విచ్ఛేదము; కామినీసమావేశాది నిమిత్తములచేఁ గలుగు ప్రకోపము ఉత్కటము; వీనికన్నిటికిని (కుండకు మన్ను ప్రకృతి యైనట్లు) అవిద్యయే ప్రకృతి అనఁగా నిమిత్తకారణము.

ఈ యవిద్య తగ్గుచు హెచ్చుచు ఉపచయాపచయములు గల వస్తువుతో తుల్యముగా నుండుటంబట్టి దీనికి నాశము కలుగును. కావున దీనిని నివర్తింపఁ జేయఁగును.

అవ. అవిద్యాక్లేశస్వరూపమును నిరూపించుచున్నారు.—

5. అనిత్యాశుచి దుఃఖానాత్మసు నిత్యశుచి సుఖాత్మ ఖ్యాతి రవిద్యా.

తా. అనిత్యము లైన వస్తువులయందు నిత్యత్వమును, అపరిశుద్ధమైన దేహాదులయందు శుచిత్వమును, దుఃఖాదులైన ప్రపంచ విషయములయందు సుఖత్వమును, ఆత్మ కాని శరీరమునందు ఆత్మతత్త్వమును భావించుట అవిద్య యనఁబడును.

వి. అనిత్య మనఁగా:— పృథివి, వస్త్రములు, పాత్రములు, ఆభరణములు మొదలైనవి.

అశుచి యనఁగా:— కామినీదేహాదులందు పరభోగ్యతా రూపమును స్వదేహాదులును.

అసుఖత్వ మనఁగా:— దుఃఖాత్మక మగు జన్మము; లేక ప్రాపంచిక విషయజ్ఞానము.

అనాత్మ యనఁగా:— స్వశరీర పుత్త్రదారాదులు.

అవిద్య యనఁగా:— లేని యంశమును పున్నట్లు కనఁబడు మనట్టి యొక విధమైన బుద్ధియే గాని అభావ మైనది కాదు ఇది అనాదిగా ఆత్మతో నంటి యుండు మత్తత దీనిని పరాకుగా నుండెడి మదదశ యనవచ్చును.

మిథ్యారూపమైన అనిత్యమందు నిత్యత్వజ్ఞానమును, అశుచిత్వము నందు శుచిత్వజ్ఞానమును, దుఃఖాత్మకమునందు సుఖత్వజ్ఞానమును, అనాత్మ యందు ఆత్మతత్త్వజ్ఞానమును కలిగియుండుటకు కారణము అవిద్యయగును. ఇట్లు అపుణ్యకార్యములందు పుణ్యత్వజ్ఞానమును, అనర్థములయందు అర్థత్వ

జ్ఞానమును కలిగించి సంసారమును వృద్ధిచేయును గాన, అవిద్యను తొలఁగఁ ద్రోయవలయును.

అవ. అస్మితాక్లేశ స్వరూపమును నిరూపించుచున్నారు.—

### 6. దృగ్దర్శనశక్త్యో రేకాత్మతైవాస్మితా.

తా. చిన్మాత్రుఁడైన సాక్షిపురుషుఁడు, రజస్తమోగుణములు లేని శుద్ధసాత్త్విక పరిణామరూపమైన అంతఃకరణము, వీనియొక్క ఐక్యము అస్మిత యనెడు క్లేశ మనఁబడును.

వి. పురుషుఁడు అజడము, అంతఃకరణము జడము; పురుషుఁడు భోక్తృవు, అంతఃకరణము భోగ్యము, ఇట్లు పరస్పరము భిన్నరూపము లైనను, వీని భేదము తెలియకయుండు జ్ఞానముచేఁ గలుగు నేననెడు అభిమానము అస్మిత యనఁబడును. చిన్మాత్రుఁడైన పురుషుఁడు దృక్ఛక్తి, బుద్ధితత్త్వము, దర్శనశక్తి; వీనియొక్క ఐక్యధ్యాసము అస్మిత.

అనఁగా:—భోక్తృశక్తియైనట్టి పురుషతత్త్వమునకును, భోగ్యశక్తియైనట్టి బుద్ధితత్త్వమునకును అత్యంతవిభాగమును, అత్యంత సంకరమును కలిగియుండఁగా, నేననెడు అభేదాధ్యాసమువలన భోగకల్పనము కలుగును. ఇట్లు కలుగుటకు అస్మితయే కారణము.

అవ. రాగక్లేశలక్షణమును నిర్వచించుచున్నారు.—

### 7. సుఖానుశయీ రాగః.

తా. ప్రపంచసుఖమును అనుసరించుటయే రాగ మనెడు క్లేశ మనఁబడుచున్నది.

వి. విషయసుఖములను తెలిసినవానికి, ఆ సుఖముల జ్ఞాపకమువలన, అట్టి సుఖములకుఁ గారణమైన విషయములయందు అభిలాష కలుగుటయే రాగము. అనఁగా, సుఖజ్ఞునకు సుఖానుస్మృతి పూర్వకంబుగా సుఖసాధనంబున జనించు ఆసక్తి రాగము.

అవ. ద్వేషక్లేశ స్వరూపమును వివరించుచున్నారు.—

8. దుఃఖానుశయీ ద్వేషః.

తా. దుఃఖమును అనుసరించి యుండునది ద్వేష మనెడు క్లేశ మనఁబడుచున్నది.

వి. దుఃఖజ్ఞునకు దుఃఖానుస్మృతి పూర్వకముగా దుఃఖసాధనమున జనించునట్టి వైరమే ద్వేషము అనఁగా దుఃఖము ననుభవించియుండు తలంపువలన ఆ దుఃఖమునకు హేతువులైన వానియందు అవి తనకు గలుగఁగూడదనెడు తిరస్కారజ్ఞానము ద్వేషము.

అవ. అభినివేశక్లేశ లక్షణమును చెప్పుచున్నారు.—

9. స్వరసవాహీ విదుషోఽపి తథా రూఢోఽభినివేశః.

తా. (పిపీలికాది (బ్రహ్మపర్యంతముగల (ప్రాణులకు నిమిత్తములేకయే జన్మాంతర సంస్కారబలముచేత శరీరమునకును, విషయములకును, తనకును యెడఁబాటు కలుఁగఁగూడదనెడు భయరూపమైన జ్ఞానము అభినివేశమనెడు క్లేశ మనఁబడుచున్నది.

వి. తనకు పూర్వజన్మమున కలిగిన మరణదుఃఖానుభవ వాసనచేత శరీరమునకును, విషయములకును, తనకును, వియోగము (ఎడఁబాటు) కలుగఁగూడదనెడు అభిమానమును వహించియుండునట్టి భయరూపమైన నిత్యసంబంధము తెలిసినవానికిగూడ పైన జెప్పినవి గోచర మగుచుండుటయే అభినివేశ మనెడు క్లేశము.

స్వరస మనఁగా స్వభావము, అనఁగా, వాసనాత్మకముగా పొందట నుండి తొలఁగక వస్తువులజూచునపుడు పుట్టుకి వుప్పొంగు మరణభయము అభినివేశము. ఇది పరోక్షజ్ఞానము కలవానికిని అజ్ఞానికిని కలుగును.

అవ. సకల క్లేశపరిహారో పాయమును జెప్ప నుద్దేశించి యిపుడు సూక్ష్మరూప క్లేశములను త్యజించుట కుపాయమును వచించుచున్నారు.—

## 10. తే ప్రతిప్రసవహేయాః సూక్ష్మాః.

తా. సూక్ష్మరూపము లైన పైన జెప్పిన క్లేశములను ప్రతిలోమ పరిణామముచేత నిరాకరింపవలయును.

వి. సూక్ష్మరూపము లైన ఆ క్లేశములను క్రమముగా నొకదాని విడిచిన యనంతరము మఱియొకదానిని విడువవలయును. అనఁగా, అభినివేశమును విడిచినమీఁద ద్వేషమును, తర్వాత రాగమును, ఆవల అస్మితను, ఆ పిమ్మట అవిద్యను విడువవలయును. ఇట్లు వీనిని తెలిసి క్రమక్రమముగా విడుచుటవలన అవిద్య నశించును. మఱల అవి కలుగవు.

అవ. స్థూలరూపములైన క్లేశములను నివృత్తి చేయుట కుపాయమును బోధించుచున్నారు.—

## 11. ధ్యానహేయాః తద్వృత్తయః.

తా. తమకార్యములను చేయుటకు ప్రారంభించియుండు ఆ క్లేశములయొక్క సుఖ దుఃఖ మోహ రూపము లైన వృత్తులను చిత్తైకాగ్రతవలన నివృత్తి చేయవలయును.

వి. సుఖ దుఃఖ మోహ రూపము లైన క్లేశవృత్తులను చిత్తైకాగ్రతవలన త్యజింపవలయును. స్థూలము లైన వృత్తులు చిత్తపరికర్మము లగు మైత్రి, కరుణ, ముదితాదులవలన నివర్తించును. ఎట్లనఁగా, మైలతోఁ గూడిన వస్త్రమును నీటిలో వైచి పుతికినమాత్రముచే నెట్లు మైల పోవుచున్నదో, అప్రకార మని భావము. మఱియును. ఆ వస్త్రమునందలి కఱ మొదలగువానిని చాటినీటిలో కడిపి వుడకబెట్టుటవలనను, ఎండలో వైచుటవలనను, ఏలాగు స్వచ్ఛ మగుచున్నదో, ఆలాగు క్లేశవృత్తులు వానికి విరోధము లైన కర్మానుష్ఠానములచేత నశించి పోవుచున్నవి.

అవ. కర్మములకును కర్మఫలములకును కారణ మైన క్లేశస్వరూపమును జెప్పుచున్నారు.—

12. క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్ట జన్మవేదనీయః.

తా. పుణ్యపాప మిశ్రకర్మములకు మూలకారణమైనది దుఃఖరూపములైన క్లేశములు. ఇట్టి వాసనారూపమైన కర్మములు ఈ జన్మమునందును, జన్మాంతరమునందును అనుభవింపఁదగినవిగా నున్నవి.

వి. దుఃఖమునకు హేతువును, క్లేశములకు కారణమునై యుండు పుణ్య పాప మిశ్రకర్మముల సంస్కారమును, వానియొక్క ఫలమును, ఈ జన్మమునందును జన్మాంతరమునందును అనుభవింపఁదగినవిగా నున్నవి. వాసనారూపములైన యీ పుణ్య పాప మిశ్రకర్మములయొక్క ప్రబల దుర్బలానుగుణ్యముగా పూర్వజన్మమునందలి వానినికూడ ఈ జన్మమునందే అనుభవింపవలసిన దగుచున్నది. ఎట్లనఁగా:—

నందికేశ్వరుఁడు బాల్యమునందే అతిశ్వరగా మహాపుణ్యఫలము నొసంగు పశుపతిపూజ యనెడి కర్మముచేత ఆజన్మమునందే దేవత్వమును, సంపూర్ణాయువును, దివ్యభోగములను బొందెను.

ధ్రువ, ప్రహ్లాదాదుల చరిత్రములును విస్పష్టము.

విశ్వామిత్రుఁడు పుణ్యకర్మోత్కృష్టత్వముచేత క్షత్రియజాతిని విడిచి బ్రాహ్మణుఁ డాయెను.

నహుషుఁడు, అత్యంతపాతకము లొనర్చినందుచే ఆ జన్మమునందే సర్పజన్మమును బొందెను.

ఊర్వశి కుమారవనమునందు లతారూపము నొందెను.

సౌభరి కర్మవైచిత్ర్యముచేత ఆ జన్మమునందే అనేకశరీరములను బొందెను.

ఈ ప్రకారముగా పుణ్యపాప మిశ్రకర్మముల బలమునకుఁ దగినట్లు ఆ సంస్కారఫలములను ఈ జన్మమునందును, జన్మాంతరమునందును అనుభవింపవలసి యున్నది.

అవ. కర్మవాసనాఫలములను నిరూపించుచున్నారు.—

13. సతిమూలే తద్విపాకో జాత్యాయు ర్భోగాః.

తా. అనాదికాల సంచిత కర్మపరిపాకము వలన జాతి, ఆయువు భోగము అనునవి యేర్పడుచున్నవి.

వి. అవిద్యాది క్లేశములు నశించువఱకును, ఆ పుణ్యపాప మిశ్ర కర్మముల పరిపాకఫల మగు జాతియు (జన్మము), చిరకాల జీవితమును, సుఖదుఃఖములకుఁ గారణ మైన యింద్రియవిషయములును (భోగములును) కలుగుచుండును.

ఇంద్రియవిషయములు గంధాదులనియు, జాతి (జన్మము) యొక్క యాయువు ఆయా ప్రాణికి నిర్ణీత మై యుండు కాలమువఱకు కనియు నెఱుంగ వలయును.

అవ. కర్మపరిపాక పుణ్యపాపఫలమును జెప్పుచున్నారు.—

14. తేహ్లాద పరితాపఫలాః పుణ్యాపుణ్య హేతుత్వాత్.

తా. పుణ్య పాప కర్మల హేతువువలన సుఖదుఃఖఫలములు కలుగు చున్నవి.

వి. పుణ్యపాప కర్మపరిపాకముచేఁ గలుగు జాత్యాయుర్భోగములు సంతోషమునకును, పాపకర్మపరిపాకముచేఁ గలుగు జాత్యాయుర్భోగములు దుఃఖమునకును కారణము లై యున్నవి.

సుఖదుఃఖాదులను గలుగఁజేయు కర్మము, కాయిక వాచిక మానసిక భేదములచే సదా జరుగుచుండుటవలన అనేకజన్మములు కలుగుచున్నవి ఈకర్మము జన్మజన్మమునందును వృద్ధి యగుచుండును.

అవ. కర్మఫలములు యోగులకు దుఃఖరూపమై యున్న దని చెప్పు చున్నారు.—

15. పరిణామ తాప సంస్కార దుఃఖైర్గుణవృత్తివిరోధా
చ్చ దుఃఖ మేవ సర్వం వివేకినః.

తా. వివేకులకు (యోగులకు) కర్మముచేఁ గలుగు సుఖదుఃఖాదులన్నియును దుఃఖరూపములుగానే యుండును.

వి. సుఖముల ననుభవించుటయందు గల గుణవృత్తి దుఃఖరూపమే గావున, వివేకులకు సర్వమును దుఃఖమే యగును. మఱియు క్లేశాదులస్వరూపము నెఱింగిన వివేకికి (యోగికి) భోగసాధనమైన సకలమును, విషమిశ్రితమైన అమృతమువలె దుఃఖరూపముగానే యుండును.

ఈ దుఃఖము పరిణామదుఃఖమనియు, తాపదుఃఖమనియు, సంస్కారదుఃఖమనియు మూఁడువిధములుగాఁ జెప్పఁబడియున్నవి.

పరిణామదుఃఖ మనఁగా — తా ననుభవించునది ముగిసి పోవుటవలన మఱల దానిని సంపాదింపవలయు ననెడి దుఃఖము.

తాపదుఃఖ మనఁగా — తా ననుభవించునట్టి విషయమునకు విరోధియైనది కోలే దనెడి దుఃఖము.

సంస్కారదుఃఖ మనఁగా — తన కిష్టమైన పదార్థముతోఁ గూడ అయిష్టమైన పదార్థ ముండుటవలనఁ గలుగు దుఃఖము.

కాఁబట్టి సత్త్వాదిగుణములచేఁ గలుగు సుఖదుఃఖమోహరూపమైన వృత్తులను భావించుచును, భావింపఁదగిన దనియును అను నీ భేదములవలన పరస్పరము విరోధము కలుగుచున్నది. వివేకి యగువాఁడు దుఃఖరూపకములైనట్టి సర్వమును త్యజింపఁదగినది.

అవ. యోగి క్లేశకర్మాదులను త్యజింపక గాని, మోక్షము నొందఁడని చెప్పుట కుద్దేశించి రాఁగల దుఃఖమును త్యజింపవలయునని వచించుచున్నారు.

16. హేయం దుఃఖ మనాగతమ్.

తా. ఇఁకను రాఁగల (అనాగత) దుఃఖమును విడువఁ దగినది.

వి. ఇదివఱకు అనుభవించిన దుఃఖములు గడచిపోయినందువలనను, ఇప్పు డనుభవించుచుండు దుఃఖములను విడుచుటకు శక్యము గాకుండుట వలనను, రాఁగల సంసారదుఃఖమును త్యజింపఁదగినది.

అవ. దుఃఖకారణమును జెప్పుచున్నారు.—

17. ద్రష్టృదృశ్యయో స్సంయోగో హేయ హేతుః.

(ద్రష్టు దృశ్యయోః) అని పాఠాంతరము.

తా. ద్రష్టృదృశ్యములసంయోగమే దుఃఖమునకు కారణము.

వి. చిన్మాత్రుఁడైన పురుషునకును, బుద్ధితత్త్వమునకును, అజ్ఞానమూలకముగాఁ గలిగిన సంబంధము గుణపరిణామరూపమైన దుఃఖమునకు కారణమై యున్నది.

చిన్మాత్రుఁడైన, (సాక్షిభూతుఁడైన) పురుషుఁడు ద్రష్ట, ఆత్మ యనియుఁ జెప్పవచ్చును. బుద్ధి దృశ్యము.

దృశ్యమనఁగా—చూడఁబడునది. ద్రష్ట యనఁగా—చూచునది.

అనఁగా, బుద్ధి ఆత్మల సంయోగము సంసారమునకును దుఃఖమునకును గారణము.

అవ. దృశ్యస్వరూపమును, దానికార్యమును, దానిప్రయోజనమును నిరూపించుచున్నారు.—

18. ప్రకాశ క్రియాస్థితి శీలం భూతేన్ద్రియాత్మకం భోగాపవర్గార్థం దృశ్యమ్.

తా. ప్రకాశము, ప్రవృత్తిస్థితి ఇవియే స్వరూపముగాఁ గలదియును, పృథివ్యాది స్థూలభూతములు, గంధతన్మాత్రాది సూక్ష్మభూతములు, శ్రోత్రాది జ్ఞానేంద్రియములు, వాగాదికర్మేంద్రియములు, బుద్ధ్యాది అంతఃకరణములు, ఈ రూపకమైన కార్యరూపమైనదియును, భోగమోక్షములు ప్రయోజనముగాఁ గలదియును; అగునట్టిది దృశ్య మనఁబడును.

వి. ఎట్లనఁగా—ఈదృశ్యము ఆత్మకలన చేతనజ్ఞానములను పొందఁదగిన ప్రకాశరూపకమైన సాత్త్వికమును; ప్రవృత్తిరూపకమైన కర్మము చేయఁదగినట్టి రాజసమును, నియమరూపకమైన స్థితి గల తామసమును గలుగఁజేయునదిగా నున్నది.

అవ. దృశ్యావస్థాభేదములను, దాని ప్రయోజనమును జెప్పుచున్నారు.

## 19. విశేషావిశేష లిఙ్గమాత్రాలిఙ్గాని గుణపర్వాణి.

తా. మహాభూతములును ఇంద్రియములును విశేషలింగములు. తన్మాత్రలును, అంతఃకరణమును అవిశేషలింగములు. బుద్ధి లింగమాత్రము. ప్రధానము అలింగము ఇవి సత్త్వాదిగుణములయొక్క అవస్థలు.

వి. సత్త్వరజస్తమోగుణముల అవస్థావిశేషములు నాలుగు విధములు. ఇవన్నియును ప్రధానతత్త్వమైన అవ్యక్తముతోఁ జేరినవి. కావున ఈ నాలుగుభేదములను తెలిసికొనుట యోగమునకు ప్రయోజనకరమైనది. (1-వ పాదము 45-వ సూత్రమును చూడుము.)

అవ. చిన్మాత్రస్వరూపమును నిరూపించుచున్నారు.—

## 20. ద్రష్టా దృశిమాత్రః శుద్ధోఽపి ప్రత్యయానుపశ్యః.

తా. పురుషుఁడు చిన్మాత్రుఁడును, పరిణామాద్యవస్థలు లేనివాఁడునైనను, విషయములను గ్రహించు బుద్ధిని యనుసరించి యుండుటవలన చూచువాఁడై యున్నాఁడని వ్యవహరింపఁబడుచున్నాఁడు.

వి. పురుషుఁడు (ద్రష్ట) సాక్షిరూపుఁడైన చేతనమాత్రుఁడే. పరిణామాది ధర్మము లేవియు లేని పరిశుద్ధుఁడైనవాఁడే. అయినను, విషయవైలక్షణ్యమును పరిగ్రహించు జ్ఞానము గంటియుండుటంబట్టి ద్రష్ట (సాక్షి) యని చెప్పఁబడుచున్నాఁడు.

పురుషుఁడు విషయోపరక్తయైనబుద్ధికి అతిసమీపమున నుండువాఁడగుటవలన బుద్ధికి యనుభవమగు సకలదుఃఖాదులను తాను అనుభ

వించువాఁ డనెడు వ్యవహారముతో సంబంధించినవాఁ డగుచున్నాఁడు. అయినను ఈ పురుషుఁడు త్రికాలబాధ్యం డనియును, ఆత్మయనియును చెప్పఁబడుచున్నాఁడు.

అవ. చిన్మాత్రుఁడే భోక్త యని తెలుపుచున్నారు.—

21. తదర్థ ఏవ దృశ్యస్యాత్మా.

తా. ఆ దృశ్యముయొక్క ప్రయత్నరూప మైన స్వరూపము ఆ పురుషునియొక్క ప్రయోజన మై యున్నది.

వి. దృశ్యమునకు పురుషునిశక్తివినా వేఱొకశక్తి లేదు కావున ఆత్మ చైతన్యమును బొంది పురుషునకు భోగ్య మై యుండు ఈ దృశ్యముయొక్క స్వరూపమును, ప్రయత్నమును, ఆ పురుషునిదే యైనందువలన అనుభోక్తృవు పురుషుఁడే యగుచున్నాఁడు.

ఎట్లన:— నిశ్చయముగా ఆత్మకు దేహమునం దెవిధ మైన భోగానుభవము (లోకానుభవము) లేకుండినను, ఆత్మచైతన్యమును బొంది యుండు కరణేంద్రియాదుల వ్యాపారము లన్నియును ఆత్మార్థముగ నెట్లున్నదో, అట్లే పురుషునియొక్క చైతన్యమును బొంది సృష్ట్యాది నానాకార్యములను చేసి నిర్వహించుచుండు ముఖ్య మైన పనులెల్లను, ఆ పురుషునికొఱకు భోగమును సంపాదించి యిచ్చెద ననెడు భావము కలిగియుండుటంబట్టి ఆ భోగములను అనుభవించువాఁడును, ఆ పురుషుఁడే యగుచున్నాఁడు. కాఁబట్టి, ఆ పురుషునికొఱకే ప్రధానమును ప్రవర్తించుచున్నది. అనఁగా ఆ పురుషుఁడే అనుభోక్త్ర నని భావము.

అవ. బంధ ముండునంతదాఁక సంసార ముండునని చెప్పుచున్నారు.

22. కృతార్థం ప్రతినష్టమప్య నష్టతదన్యసాధారణత్వాత్.

తా. దృశ్య మైన ప్రధానము వివేకము గలవానికి నష్ట మైనను, ఇతరు లగువారికి భోగమునకు సాధక మై యుండుటవలన సాధారణముగా సకల మైనవారును బంధరహితులు గా నేరరు.

వి. వివేకజ్ఞానముచే కృతార్థుఁడైనవానికి (యోగికి) మాత్రము దృశ్యము వ్యాపారశూన్యముగా నుండును. తక్కిన యజ్ఞానుల కెల్లను దృశ్యము మిగిలియుండును; కావున బంధమునఁ దగిలినవా రగుచున్నారు. అనఁగా, ప్రపంచరూపమైన సంసారము నాశము కానేరదు.

అవ. సంయోగ స్వరూపమును నిరూపించుచున్నారు.—

23. స్వస్వామిశక్త్యోః స్వరూపోపలబ్ధి స్సంయోగః.

తా. స్వశక్తి, స్వామిశక్తుల (చూడఁబడునట్టియు, చూచునట్టియు) స్వరూపముల సాక్షాత్కారమునకు సంయోగమే కారణము.

వి. స్వశక్తి చూడఁబడునట్టి స్వభావము. అనఁగా భోగ్యత్వము. స్వామిశక్తి చూచు స్వభావము. అనఁగా భోక్తృత్వము. దృశ్యమునకు భోగ్యత్వమును, పురుషునకు భోక్తృత్వమును అనాదిసిద్ధమై యుండుటచే, భోగ్యభోక్తృత్వ స్వభావముకంటె వేఱే సంయోగ సంబంధము లేదుగాన; దృశ్యమునకు భోగ్యత్వమును, పురుషునకు భోక్తృత్వము నుండుటయే సంయోగ మనఁబడుచున్నది. అనఁగా ఆత్మ భోక్త యనియును, బుద్ధి భోక్త్రి యనియును భావము. బుద్ధియొక్కయు ఆత్మయొక్కయు సంబంధమే అజ్ఞానము.

అవ. ఆ సంయోగమునకు కారణమును జెప్పుచున్నారు.—

24. తస్య హేతు రవిద్యా.

తా. ఆ సంయోగమునకు అవిద్యయే కారణ మగుచున్నది.

వి. అజ్ఞానరూపమైన అవిద్యయే సంయోగమునకు కారణముగ నున్నది. దీనిని త్యజింపనివాఁడు వివేకి (యోగి) కాఁడు. ఇది దుఃఖమునకును కారణమై యున్నది. దీనిపనులెల్ల ఇహజీవనోపాయములుతప్ప పరసాధకమార్గములు కావు. (ఈవిషయము ఇదేపాదము 5 వ సూత్రమున వివరింపఁబడి యున్నది.)

అవ. సంయోగత్యాగలక్షణమును బోధించుచున్నారు.—

25. తదభావాత్సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యమ్.

తా. సంయోగమునకు పదార్థములవలె నాశము కలుగుట లేదు. వివేకము కలిగినచో ప్రయత్నము లేకయే నివృత్తి యగును. ఇట్లగు సంయోగనివృత్తియే కైవల్యమనఁబడును.

వి. ఆత్మజ్ఞానము కలుగఁగాచో అవిద్య నశించును. అవిద్యాకార్యమైన సంయోగనాశమే త్యాగము. సంయోగనివర్తియే పురుషునకు మోక్షము.

వివేకజ్ఞాన ప్రకాశముచేత క్రమముగా బుద్ధియొక్కయు ఆత్మయొక్కయు ప్రతిబింబములును, బుద్ధియు, నశించిపోయి చేతనమునకు కైవల్యస్థితి కలుగును.

అవ. దృశ్యత్యాగోపాయమును నిరూపించుచున్నారు.—

26. వివేకఖ్యాతి రవిప్లవా హానోపాయః.

తా. చంచలము లేనట్టి వివేకమువలనఁ గలిగిన పరిశుద్ధజ్ఞానమే బుద్ధ్యాత్మలసంయోగత్యాగమునకు నుపాయము.

వి. బుద్ధ్యాత్మలసంబంధముయొక్క పరిశీలనమే వివేకజ్ఞానము. ఈ వివేకజ్ఞానమును ముఖ్యముగా సంపాదింపవలయును.

అవిద్యారూపమైన అజ్ఞానమునకు విరుద్ధమైన నిజజ్ఞానబలముచేత అవిద్య లయమై, జ్ఞాతృత్వ కర్తృత్వాద్యభిమానము లుడిగి రజస్తమోగుణములయొక్క సంబంధములేని శుద్ధసత్త్వప్రధానమైన బుద్ధి అంతర్ముఖమై చిచ్ఛక్తియందు విశ్రమ మగుటయే వివేకఖ్యాతి యనఁబడుచున్నది. అట్టి వివేకఖ్యాతి సర్వదా యేకస్వరూపమై ప్రవర్తించుచుండఁగా వికారస్వరూపమైన దృశ్యము నివర్తించును. ఈ దృశ్యముయొక్క కార్యములెల్లను లేకపోవుటవలన కైవల్యస్థితి కలుగును.

అవ. వివేకఖ్యాతిలక్షణమును వచించుచున్నారు.—

27. తస్య సప్తధా ప్రాన్తభూమిః ప్రజ్ఞా.

తా. వివేకజ్ఞానము కలిగినవానియొక్క ప్రజ్ఞావిశేషము యేడువిధములుగా నున్నది.

వి. వివేకజ్ఞానము పరిపాకమునకు రావలసియున్నయెడల సప్తభూమి కలదు కడగా నుండవలయును.

చరాచరాత్మకమై ప్రధానతత్త్వమువలన నెలకొనియుండు ఈ ప్రపంచముయొక్క విశిష్టానుభవము సర్వవిధములచేతను దుఃఖరూపకమైన దని నేను చక్కఁగా తెలిసినవాఁడ నైతిని; ఇఁక ఈ ప్రపంచవిషయకమైన సంగతులయందు నేను తెలిసికొనవలసినది కొంచమైనను లే దనునది మొదటి భూమిక యగుచున్నది.

నాచిత్తమందున్న అవిద్యాదిక్లేశము లెల్లను నిశ్శేషముగా నశించి పోయినది; ఇఁక నాశము జేయఁదగిన క్లేశము లేవియు లేదనునది రెండవ భూమిక యగుచున్నది.

సంప్రజ్ఞాత సమాధియొక్క కడపటిభాగమైన నిరోధపరిణామము వలన గల స్థితులను సాక్షాత్తుగా అనుభవమునకు తెచ్చుకొంటిని; ఇఁక నాయొక్క ప్రయత్నముచేత అనుభవమునకు తెచ్చుకొనునట్టి అధ్యాత్మ ప్రమేయములు యేవియు లేవనునది మూఁడవభూమిక యగుచున్నది.

జనన మరణ ప్రవాహరూపమై పరిణమించుచుండు సుఖదుఃఖమోహ రూప ప్రపంచాత్మకమైన ప్రపంచమును జయింపఁదగిన ముఖ్యసాధనమైన వివేక జ్ఞానమును సంపాదించితిని; ఇఁక ప్రకృతిని జయించుటకు నేను సంపాదింపవలసిన దేమియు మిగిలి యుండ లే దనునది నాలుగవభూమిక యగుచున్నది.

భోగమోక్షరూపమైన విషయములందు చేయవలసినదాని నంతయు చేసి నాబుద్ధి కృతకృత్యమును పొందినదనునది ఐదవభూమిక యగుచున్నది.

మోహరూపమైన అవిద్యాదిక్లేశములు నశించిపోయినందువలన జాగ్రదాద్యవస్థాపారమునకు కారణములైన సాత్త్వికాది గుణత్రయముల యొక్క వ్యాపార మెల్లను పాలనుండి విడదీసిన నేయి, మఱల పాలలోఁ గలియని విధమున ఆ త్రిగుణములు మఱల నాచిత్తమును పొంద దనునది ఆఱవ భూమిక యగుచున్నది.

నాయొక్క బుద్ధి ధ్యానము ఆత్మయందైక్యమై నేను ప్రకృతివ్యతిరిక్తుఁడ నైనందున జీవించియుండియు స్వస్వరూపమైన కైవల్యస్థితిని స్వాభావికముగనే కలవాఁడనై యున్నాఁడ ననునది యేడవభూమిక యగుచున్నది.

స్వప్రయత్నముచేఁ గలుగఁజేసికొనఁదగిన మొదటి నాల్గుభూమికలచేత, ఇఁకముందు ప్రపంచాను వర్తనయందును కర్మఫలములయందును నిశ్శేషముగా ఆశ తప్పిపోయి, పరిణామము మొదలు ప్రధానతత్త్వము వఱకుఁగల ప్రకృతి యొక్క విషయకమైన సకలవిచారములయందును బుద్ధికి యే విధమైన మఱుఁగును లేకపోవునంతటి ప్రజ్ఞావిశేషములు కల్గును.

అఁగా, స్వప్రయత్నముచే సాధింపఁదగిన మొదటి నాలుగు భూమికలును చిత్తవృత్తి విముక్తి (కార్యవిముక్తి) రూపకమైన దనియును, అప్రయత్నముగాఁ గలుగఁదగిన మిగిలిన మూఁడు భూమికలును చిత్తవిముక్తి రూపకమైన దనియును భావము.

అవ. వివేకఖ్యాతి కలుగుటకు కారణమును జెప్పుచున్నారు.—

28. యోగాఙ్గానుష్ఠానా దశుద్ధిక్షయే జ్ఞానదీప్తి రావివేకఖ్యాతేః.

తా. ఇదివఱకుఁ జెప్పఁబడిన యోగాంగానుష్ఠానము వలన కలుగునట్టి చిత్తసాత్త్విక పరిణామరూపమైన బుద్ధియొక్క ప్రకాశముచేత క్లేశరూపములైన చిత్తమలములు పోయి వివేకఖ్యాతి కలుగుచున్నది.

వి. వివేకఖ్యాతి కలుగు పర్యంతము యోగాంగముల నాచరింపుచుండ వలయును. అప్పుడు చిత్తశుద్ధి కల్గును. దానివలన సాత్త్వికపరిణామ రూపమైన బుద్ధికి ప్రకాశము కల్గును. ఇట్లు బుద్ధికి ప్రకాశము కలుగుటయే వివేకఖ్యాతి యనఁబడును.

అవ. అష్టాంగ యోగములను విభజించి చెప్పుచున్నారు.—

29. యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధయోఽష్టావఙ్గాని.

తా. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి; అను నివి యెనిమిదియు యోగాంగము లనఁబడును.

వి. యమ మనఁగా:— ప్రాణిహింసచేయుట, అబద్ధమాడుట, పరధన మపహరించుట, భోగసాధన పదార్థములను స్వీకరించుట, అనునివి లేకుండుట.

నియమ మనఁగా:— పరిశుద్ధత, సంతుష్టి, నిష్ఠ (తపస్సు), మంత్రజపము, ఈశ్వరభక్తి, వీనిని యాచరించుట.

ఆసన మనఁగా:— వీర్యనిగ్రహము చేసి, దేహదార్ఢ్యమును సంపాదించు, చిత్తస్థైర్యము నిమిత్తము కూర్చుండుట.

ప్రాణాయామ మనఁగా:— శాస్త్రోక్తప్రకారముగా ముక్కుయొక్క ఒక ద్వారముచే శ్వాసమును లోపలికి పీల్చి, దానిని లోపలనుండ నిచ్చిన తర్వాత వేఱొక ద్వారముచే బైటవిడుచుట మొదలగు శ్వాససంబంధ కృత్యములు. (1-వ పాదము 34-వ సూత్రమును చూడుము).

ప్రత్యాహార మనఁగా:— ఇంద్రియములను తమతమ వ్యాపారముల యందు ప్రవర్తింపనీకచేసి చిత్తమునకు మఱల్చుకొనుట.

ధారణ యనఁగా:— చిత్తమును ఒకచోట స్థిరముగా నిల్పుట.

ధ్యాన మనఁగా:—ధారణాస్థలమున బుద్ధిని నిల్పి మననముచేయుచుండుట.

సమాధి యనఁగా:—ధ్యానము దృఢమై ధ్యానము చేయుచున్నా ననెడి తలంపుపోయి చిత్తము విషయాంతరముల గోచరము లేక వ్యాపార శూన్యమైనదై ధ్యేయాకారమై యుండుస్థితిగా నుండుట. (సమాధివిషయమై మొదటిపాదమున చాలవఱకు జెప్పఁబడి యున్నది). అష్టాంగముల విషయము దిగువ నుదహరింపబడును.

[అష్టాంగవిషయములను విస్తరముగాఁ దెలిసికొనుట కపేక్షించువారు రాజయోగ రత్నాకరమునందు జూఁడదగును].

అవ. యమముయొక్క లక్షణమును జెప్పుచున్నారు.—

30. అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహా యమాః.

తా. ప్రాణులను హింసచేయకుండుట, మనః పూర్వకముగా సత్యము పల్కుట, పరులసొమ్మును అపహరింపకుండుట, ఇంద్రియనిగ్రహము చేయుట, భోగసాధన పదార్థములను పైకొనకుండుట ఇవి యమము.

వి. పైని చెప్పఁబడిన వాని నైదింటిని ప్రథమమున వర్ణించి, అనంతరము నియమము నభ్యసించుటకు ప్రవర్తింపవలయును. యమముయొక్క కృత్యములను వర్జింపక, నియమము నాచరించుట సాధకునకు హానిని కలుగఁ జేయును ఇవి నిషిద్ధకార్యములు గాన అవశ్యము వర్జింపవలయును.

అవ. యమాంగముల నేకాలమునను విడువగూడదని చెప్పుచున్నారు.

31. ఏతే జాతి దేశ కాల సమయానవచ్ఛిన్నాః సార్వభౌమా మహావ్రతమ్.

తా. జాతి, దేశము, కాలము, సమయము, అను వీనియందుఁ గాని; మతియే యవస్థయందుఁగాని, యమాంగములను తప్పక నాచరింపవలయును.

వి. బ్రాహ్మణత్వాది జాతులు, కాశీ రామేశ్వరాదిదేశములు, శివరాత్రి ఏకాదశ్యాది కాలములు, బ్రాహ్మణ ప్రయోజనము, వివాహాది సమయములు అగునివి మొదలగు నెట్టి సందర్భములలోఁ గాని హింస చేయకూడదు. అబద్ధము చెప్పకూడదు; పరద్రవ్యము నపహరింపఁగూడదు; ఇంద్రియమును ప్రయము చేయఁగూడదు (వ్యభిచరింపఁగూడదు); భోగసాధన వస్తువులను గ్రహింపఁగూడదు; అని యిట్లు సర్వదా జ్ఞాపకమునం దుంచుకొని ప్రవర్తించు చుండు మహావ్రతము యమ మనఁబడును.

అవ. నియమలక్షణమును నిరూపించుచున్నారు.—

32. శౌచ సన్తోష తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః.

తా. శుచిత్వము, సంతోషము, తపము, స్వాధ్యాయము, ఈశ్వర భక్తి, ఇవి నియమ మనఁబడును.

వి. మన్ను నీళ్లు మొదలగువానిచే దేహమును శుద్ధిచేయు బాహ్యశౌచము, మైత్ర్యాది పరికర్మములచే చిత్తమలమును పోఁగొట్టుకొనునట్టి అంతర శౌచము అను ద్వివిధ శుచిత్వమును, (1-పా. 33-వ సూత్రమును చూడుము) సదా సమాధాన మనస్కుఁడై యుండు సంతోషమును, నిష్ఠయు, ప్రణవ పూర్వకమైన వేదమంత్రజపమును, పరమేశ్వరునియందు భక్త్యతిశయమును, (ఇదేపాదమున 1 సూత్రమును చూడుము) నియమ మనఁబడుచున్నది.

అవ. యమ నియమములచే యోగము సిద్ధించు ననుచున్నారు.—

33. వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్.

తా. యోగప్రతి బంధకములైన హింసాదులను నశింపఁజేయుటకు అహింసాదుల భావనయే కారణమై యున్నది.

వి. యోగవిరోధమైన హింసాదులకు ప్రతిరోధమైన యహింసాదులను భావించుటవలన మహాపాతకములకు కారణములైన హింసాదులు నాశనమై

యోగము చేకూడదు. కావున యమ నియమముల ఆచరణలేనివా రెన్నటికిని ఉత్తమస్థితికి యోగ్యులు కారు. సర్వోత్తమస్థితిని (యోగమును) అభిలషించిన వారికిది ఆవశ్యకమై యున్నది.

అవ. యోగవిరోధముయొక్క స్వరూపమును, దానికి కారణమును దానియొక్క భేదమును, దానిఫలమును జెప్పుచున్నారు.—

34. వితర్కా హింసాదయః కృతకారి తానుమోదితా లోభ క్రోధ మోహా పూర్వకా మృదుమధ్యాధిమాత్రా దుఃఖాజ్ఞానానన్త ఫలా ఇతి ప్రతిపక్ష భావనమ్.

తా. తానుచేయుట, ఇతరులచేఁ జేయించుట, ఇతరులు చేసినదానిని జూచి సంతోషించుట, అనునివి స్వరూపముగాఁ గలదియు) ఆశ, ద్వేషము, భ్రమ, ఇవి కారణముగాఁ గలదియు) మందము, మధ్యము, తీవ్రము, అను భేదములు గలదియు) దుఃఖము, అజ్ఞానము, ఇవియే పారము లేని ఫలముల నొసంగునదియు) అగు నిట్టి యోగవిరోధమైన హింసాది కార్యములను విడుచుటకు అహింసాదులను అభ్యసింపవలయును.

వి. హింసాదులయందు తగిలిన చిత్తము తనను చేయునట్లు చేయును, పరులచేఁ జేయింప పురికొల్పును, ఇతరులు చేసినదానిని జూచి సంతోషింప జేయును, దానిపై ఆశను పుట్టించును, క్రోధమును కలుగఁజేయును. మోహము కలుగును. మంద మధ్యమతీవ్రము లగు అవస్థలలో పడునట్లు చేయును, దుఃఖమును, అజ్ఞానమును కలుగును, వీనివలన అపారమైన దుఃఖఫలములు సంప్రాప్తమై అనేక జన్మముల నొందింపఁజేయును. అందువలన ముక్తినొందుటకు సాధ్యము లేకపోవును, కాఁబట్టి యోగప్రతి బంధకములైన హింసను చేయక యుండవలయును. హింసచేయమియే అహింసను అభ్యసించుట యనఁబడును.

అవ. అహింసాభ్యాసముయొక్క ప్రయోజనమును జెప్పుచున్నారు.

35. తత్సన్నిధౌ వైరత్యాగః.

తా. అహింసాభ్యాసము చేయునట్టి యోగి నివసించు స్థలమునందు, స్వాభావికముగా వైరము గల గోవ్యాఘ్రములు, గజసింహములు మొదలగు నవికూడ వైరమును విడిచి ప్రవర్తించును.

వి. జాగ్రత్స్వప్నాదులయందు సహా మనోవాక్కాయములచే హింసఁ జేయఁగూడదని తలంచియుండు యోగి (వివేకి) సమీపమున స్వభావ సిద్ధముగా ద్వేషముతోఁ గూడి ప్రవర్తించు వైరివర్గములకు ప్రాణులెల్లను తమతమవైరమును విడిచి పరస్పర స్నేహభావముతో నుండును.

అవ. సత్యాభ్యాసికి గల్గు ఫలమును నిరూపించు చున్నారు.—

36. సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్.

తా. సత్యము నభ్యాసముగా కలవాఁడు, అగ్నిష్టోమాది కర్మములు చేయకపోయినను, వానికి ఆయా కర్మఫలములు లభించును.

వి. సదా సత్యమును విడువక అభ్యాసము చేయువానికి, (సత్యము పలుకువానికి) ఏ విధమైన సత్కర్మములు చేయకపోయినను, ఆ కర్మములకుఁ దగిన ఫలములెల్లను ప్రాప్తించును. మఱియు వాని వచనమాత్రము చేతనే, కర్మములు చేయని యితరులకును ఆకర్మఫలము లభించును. అనఁగా సత్యము నందుదృష్టి కలవానికి నిగ్రహానుగ్రహశక్తి కలదని భావము.

అవ. చౌర్యము చేయనివానికిఁ గలుగు ఫలమును జెప్పుచున్నారు.—

37. అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్.

తా. దొంగతనము చేయకుండువానికి సమస్తరత్నములును ప్రాప్తించును.

వి. పరులద్రవ్యమును అపహరింపకుండుటను అభ్యసించిన దృఢచిత్తునకు తాను ఆశలేని వాఁడైనను, అప్రయత్నముగనే సకలస్థలములయందుఁగల సమస్తరత్నములు తనంతట లభించును.

అవ. ఇంద్రియ నిగ్రహమువలని ప్రయోజనమును వచించుచున్నారు.

38. బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః.

తా. బ్రహ్మచర్యమును అభ్యసించుటవలన బ్రహ్మవర్చస్సు లభించును.

వి. ఇంద్రియ నిగ్రహమును అభ్యసించు స్థైర్యము గలవానికి వీర్యము (తేజము = బ్రహ్మవర్చస్సు) యొక్క లాభము కలుగును. మఱియు బలము కలుగును. మేధస్సు పరిశుద్ధ మగును. దీనివలన ఆత్మజ్ఞానము గోచరించును. కావున యింద్రియములను చలింపనీయక కాపాడఁదగినది.

అవ. భోగసాధన వస్తువులను గ్రహింపనివానికి గలుగు ఫలమును నిరూపించుచున్నారు.—

39. అపరిగ్రహ స్థైర్యే జన్మకథంతా సంబోధః.

తా. భోగసాధన వస్తువులను స్వీకరింపని అభ్యాసముగలవానికి, పూర్వ జన్మములందు తా నెలాగున నుండెనను జ్ఞానము ప్రాప్తించును.

వి. ఎల్లప్పుడును అపరిగ్రహమును అభ్యాసము చేయు దృఢమనస్కునకు జన్మాంతరములయందు తాను యే ప్రాణిగ నుండినదియు, ఏపని చేసినదియు, ఏ ఫలము నొందినదియు నివి మొదలుగాఁగల విషయములు జ్ఞప్తికి వచ్చును. అనఁగా, పూర్వజన్మ జ్ఞానము గోచరించునని భావము. కాఁబట్టి దీనిని యోగి యగువాఁడు ప్రారంభమునందే అభ్యసింపవలసినది.

అవ. శౌచముయొక్క ఫలమును జెప్పుచున్నారు.—

40. శౌచాత్స్వాఙ్గజుగుప్సాపరై రసంసర్గః.

తా. శుచిత్వమును అభ్యసించుటవలన తన అవయవములయందు అసహ్యమును, ఇతరుల సంబంధము కూడ దనియును బోధ మగును.

వి. పరిశుద్ధతను అభ్యాసముచేయువానికి తన దేహోత్పత్తికిఁ గారణము లైన మాతా పితృ దేహజన్య శుక్లశోణిత రూపమైన పర్యాలోచన వలన తన దేహమునందు జుగుప్సయును, పరులను స్పృశించుట కేవల మసహ్యమని

యును తోఁచును. మఱియు, శుచిత్వమువలన బుద్ధి మాంద్యముపోయి జాగ్రూకత గలుగును పాపుల సంసర్గమును తప్పింపఁజేయును. అందువలన వారి సంసర్గముచేఁ గలుగు దోషములును దుర్గుణములును యెంతమాత్రమును దగ్గఱ జేరవు. కావున దీనిని అందఱును అభ్యసింపఁ దగినది.

అవ. శౌచమువలనఁ గలుగు విశేషఫలమును వచించుచున్నారు.—

41. సత్త్వశుద్ధి సౌమనస్యైకాగ్ర్యేన్ద్రియ జయాత్మ దర్శనయోగ్యత్వానిచ.

తా. శుచిత్వమువలన సత్త్వశుద్ధియును, దీనివలన సౌమనస్యమును, దీనివలన చిత్తైకాగ్రతయును, దీనివలన ఇంద్రియజయమును, దీనివలన ఆత్మ దర్శన జ్ఞానమును కలుగును.

వి. పరిశుద్ధుఁడైనవానికి రజస్తమోగుణముల వశతయును, మనస్సునందు కొంచెమైనియు దుఃఖము లేని ప్రీతియును, చిత్తస్థైర్యమును, విషయములయందు విముఖతయును, బ్రహ్మజ్ఞానమునందు సమగ్రతయును కలుగును.

అవ. సంతోషముతో నుండువానికిఁ గలుగు ప్రయోజనమును జెప్పుచున్నారు.—

42. సంతోషా దనుత్తమ స్సుఖలాభః.

తా. సంతోషాతిశయమువలన నిరతిశయమైన ఆనందము కలుగును.

వి. సర్వదా సంతోషముగా నుండువానికి బ్రహ్మానందమువలె నిరతిశయానందము ప్రాప్తించును. అనఁగా, సంతుష్టిచే ప్రాప్తించిన దానిని పొంది, సంతోషించువానికి ఆశలు కలుగుటకు అవకాశము లేకుండును. అందువలన సకల దుఃఖములను నివృత్తియగును.

అవ. తపస్సువలని ప్రయోజనమును వచించుచున్నారు.—

43. కాయేన్ద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్తపసః.

తా. తపస్సు చేయుటవలన చిత్తమునందలి మలినము తొలఁగు చున్నది. అందువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు అద్భుతశక్తి కలుగుచున్నది.

వి. కృచ్ఛ్రచాంద్రాయణాదులవలన, చిత్తము మలరహితమై పరిశుద్ధమై యుండును. అందువలన స్వేచ్ఛానుసారముగా తనదేహమును అణురూపముగాఁ గాని మహద్రూపముగాఁ గాని చేసికొను శక్తియును; మఱియు, ఇంద్రియముల కెదురుగా నుండు సూక్ష్మవస్తువులనుగాని, మఱుఁగుగాఁ గనబడకుండు ఏవస్తువులను గాని గోచరింపఁజేసుకొను శక్తియును కలుగును.

అవ. జపము చేయువానికిఁ గలుగు ఫలమును జెప్పుచున్నారు.—

44. స్వాధ్యాయాదిష్టదేవతాసంప్రయోగః.

తా. తనకు ఇష్టమైన మంత్రమును జపించుటవలన, తాను కోరిన దేవత ప్రత్యక్షమగును.

వి. వేదమంత్రములయందు తనకు అభిమతంబైన దేవతామంత్రమును ఓంకారపూర్వకముగా జపించుటవలన ఆదేవత సాక్షాత్కారమై తన యిష్టార్థముల నొసంగును. మఱియు ప్రణవపూర్వకమైన ఈశ్వరోపాసన వలన చిత్తము నిర్మలత్వము నొందును. అందువలన మనస్సంకల్పము లెల్లను తొలఁగును.

అవ. ఈశ్వరప్రణిధానమువలని లాభమును జెప్పుచున్నారు.—

45. సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్.

తా. పరమేశ్వరునియందు అతిశయమైన భక్తి చేయుటవలన సంప్రజ్ఞాత సమాధిలాభము కలుగును.

వి. ఈశ్వరునియందు అధికమైన భక్తిని యుంచుటవలనఁ జిత్తమందలి సకలమలినములు నశించును. ఆ పరమేశ్వరునకు సమీపమునం గుండా సంప్రజ్ఞాతసమాధివఱకు నిరాటంకముగా సిద్ధించును. (సంప్రజ్ఞాతసమాధి లక్షణము 1-వ పా. 17-వ సూత్రమున విపులముగా వివరింపఁబడి యున్నది).

అవ. ఆసనాభ్యాసమువలని ప్రయోజనమును నిరూపించుచున్నారు.

**46. స్థిరసుఖ మాసనమ్.**

తా. ఆసనములు స్థిరమును సుఖమును కలుగఁజేయును.

వి. వీరాసనము, స్వస్తికాసనము, పద్మాసనము, సిద్ధాసనము, సింహాసనము, కుక్కుటాసనము, భద్రాసనము, యోగాసనము మొదలుగాఁగల ఆసనములలో నెవరికి యే ఆసనము నిశ్చలమై సుఖకరమైయుండునో దానిని వారు అభ్యసింపవలసినది. ఆసనములయొక్క దృఢాభ్యాసమువలన చిత్తమునకు స్థిరత్వము కలుగును.

84 ఆసనములు ఎనుబదినాలుగు. ఇదియును గాక మతాంతరములును గొన్ని గలవు. అందు ముఖ్యమైనవానిలోఁ గొన్నిటిని యిచట చెప్పఁబడును.

(1) వీరాసనము:—ఒకతొడమీఁద నొకపాదమును, ఇంకొక తొడమీఁద వేఱొకపాదము నుంచి శరీరమును వంకరలేక నిల్పుట.

(2) స్వస్తికాసనము:—పిక్కలయొక్కయు తొడలయొక్కయు మధ్యలో పాదములనుంచి దేహమును చక్కఁగ నిక్కించుట.

(3) పద్మాసనము:—ఎడమతొడపై కుడిపాదమును, కుడితొడపై యెడమపాదమునుంచి, వెనుకప్రక్కనుండి కుడిచేతితో నెడమతొడపై నున్న కుడికాలి పెద్దవ్రేలిని, ఆ ప్రకారముగానే యెడమచేతితో కుడితొడపై నున్న యెడమకాలి పెద్దవ్రేలిని పట్టుకొని, ఱొమ్మునందు గడ్డమునుంచి, భ్రూమధ్యమందు దృష్టిని నిల్పుట.

(4) సిద్ధాసనము:—ఎడమకాలి మడమను మూలాధారమునందును, కుడి కాలిమడమను లింగస్థానమందు నుంచి, శిరస్సు కంఠము భుజము వీనిని చక్కఁగా నిక్కించి, భ్రూమధ్యమును జూచుచుండుట.

(5) మతాంతరసిద్ధాసను :—లింగముమీఁద యెడమ మడమనుంచి, దానిపై కుడిమడిమ నుంచి, నాసాగ్రమును చూచుచుండుట. దీనినే వజ్రాసన మనియు, ముక్తాసన మనియు, గుప్తాసన మనియుఁ జెప్పుదురు.

(6) సింహాసనము :—అండకోశముల క్రింది ప్రదేశములందు తొడల యొక్క వెనుకటి భాగములు అంటునట్లు, కుడియెడమల మడమలను మార్చి యుంచి, కుడి యెడమచేతుల వ్రేళ్లను మోఁకాళ్లమీఁద సక్యంబుగ విడల్చుగ నుంచి, నిక్కి కూర్చుండి నోరుదెఱచికొని, భ్రూమధ్యమందలి చిద్బిందువును వీక్షించు చుండుట.

(7) కుక్కుటాసనము:—పద్మాసనమున నుండి మోకాళ్లతొడలసందు లలో చేతులనుదూర్చి, చేతులను నేలనూని పైకెగసినట్లుండుట.

(8) భద్రాసనము:—అండకోశములకు దిగువ చీలమండనుంచి, మడమల రెంటిని రెండుచేతులతోఁబట్టి కదలకుండుట దీనినే గోరక్షాసన మనియును జెప్పుదురు.

(9) యోగాసనము :—హంసపండమును మోకాళ్లక్రింద నుంచుకొని పాదములను నేలపై నిల్పి తొడలసందున చేతులనుంచి పిక్కలను బట్టుకొని ఆత్మావలోకనము జేయుచుండుట.

(10) కూర్మాసనము:—ఆధారమునకు రెండుప్రక్కలయందు రెండుకాళ్ల మడమలను హత్తించి, రెండుమోఁకాళ్లను భూమియందుంచి నిక్కి చక్కఁగాఁ గూర్చుండుట.

(11) గోముఖాసనము :—ఎడమ కాలిమడమ కుడివీపుప్రక్కగాను, కుడి కాలిమడమ యెడమవీపుప్రక్కగాను, మోఁకాలిమీఁద మోఁకాలుకదియ

నుంచి పాదాంగుష్ఠములను చేతులతోఁబట్టి శరీరమును చక్కఁగ నిక్కించి భ్రూమధ్యావలోకనము చేయుచుండుట.

(12) ధనురాసనము:—పాదాంగుష్ఠముల రెంటిని రెండుచేతులతో ధనురాకారముగా వీపువెనుక చెవులకు సరిగాఁ బట్టియుండుట.

(13) కపాలాసనము:—తలక్రిందుగ నిలిచి భ్రూమధ్యమందలి చిద్బిందువును చూచుచుండుట.

ఇందు గృహస్థులకు పద్మాసనమును సిద్ధాసనమును ఉత్తమమైనను, గృహస్థులకు పద్మాసనమే మేలు. తక్కిన ఆశ్రమస్థులకు సిద్ధాసనము మేలు సిద్ధాసనమువలన ఇంద్రియనిరోధము, శరీరదార్ఢ్యము, నిర్మల చిత్తవృత్తి, ఇవి కలుగును. మతాంతరసిద్ధాసనము సకలాసనములలోను మేలైనది. ఇది ముక్తిద్వారకవాటపాటన పటువైనది. కపాలాసనమును ప్రతినిత్యము జాముసేపు అభ్యాసము చేయుచుండినచో మూఁడునెలలకు మీఁద జరారహితుండును మృత్యుంజయుండును అగును.

(ఇంకను అనేకాసనములు కలవు. వానిని ఆసన విధాన స్వరూప పటములతో ముద్రించిన "హఠయోగప్రదీపిక" యందుఁ గనందగును).

అవ. ఇష్టాసనసిద్ధికి ఉపాయమును జెప్పుచున్నారు.—

47. ప్రయత్నశైథిల్యానన్త సమాపత్తిభ్యామ్.

తా. ఆసనమును అభ్యాసము చేయుచున్నను, తనకు (ఆసనము) సిద్ధింపకలయుననెడు తలంపు సదా యుండెనేని సులభముగా సిద్ధించును.

వి. తాను ఇచ్ఛయించిన ఆసనమును క్రమప్రకారము అభ్యసింపకపోయినను, తాను కోరినట్టి ఆసనము అవిచ్ఛిన్నముగా జ్ఞాపకమునం దుండెనేని తనంతట సిద్ధించును. అయినను వారివారి శక్తికిఁ దగిన ఆసనమును అభ్యసించుటకు ప్రయత్నము చేయుటయే ఉత్తమము.

అవ. ఆసనసిద్ధియొక్క ఫలమును బోధించుచున్నారు.—

48. తతో ద్వన్ద్వాఽనభిఘాతః.

తా. ఆసనము సిద్ధించినమీఁద శీతోష్ణాది ద్వంద్వములచే బాధింపఁబడఁడు.

వి. తాను కోరిన ఆసనము సిద్ధించిన పిమ్మట, శీతోష్ణ క్షుత్పిపాసాది ద్వంద్వములు వానిని బాధింపవు.

అవ. ఆసన సిద్ధ్యనంతరకృత్య మైన ప్రాణాయామమును చెప్పుచున్నారు.—

49. తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః.

తా. ఆసనసిద్ధి కలిగిన తర్వాత ఉచ్ఛ్వాస నిశ్వాసములయొక్క గమనాగమనముల నిరోధము చేయుటయే ప్రాణాయామ మనఁబడును.

వి. శ్వాసమును విడుచుటయును, శ్వాసమును పీల్చుటయును, క్లృప్త ప్రకారము చేయవలయునని యెఱుఁగునది.

అవ. ప్రాణాయామ విభాగాది విశేషము జెప్పుచున్నారు.—

50. సతు భాహ్యాభ్యన్తర స్తమ్భవృత్తి ర్దేశకాల సంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘ సూక్ష్మః.

తా. ప్రాణాయామ మనునది త్రివిధము. శ్వాసమును బైటవిడుచుట రేచకప్రాణాయామ మనియును, శ్వాసమును లోపలికి పీల్చుట పూరకప్రాణాయామ మనియును, శ్వాసమును లోపలనే నిల్పియుంచుట కుంభకప్రాణాయామ మనియును చెప్పఁబడును. ఇది దేశముచేతను, కాలముచేతను, సంఖ్యచేతను, దీర్ఘముచేతను, సూక్ష్మముచేతను. క్లృప్తమై (నియమితమై) యున్నది.

వి. నాసికమునుండి 12 అంగుళములవఱకు శ్వాసమును విడుచుట దేశక్లృప్తము.

శ్వాసమును 16 మాత్రలకాలము రేచకమును, 32 మాత్రలకాలము పూరకమును, 16 మాత్రలకాలము కుంభకమును చేయుట కాలక్లిప్తము.

ఈ రేచక పూరక కుంభకములను ప్రతిదినమును యిన్నిమాఱు లని లెక్కబెట్టుట సంఖ్యాక్లిప్తము.

నాసికమునుండి 16 అంగుళములవఱకు శ్వాసమును విడుచుట దేశదీర్ఘము.

శ్వాసమును 24 మాత్రలకాలము రేచించుట కాలదీర్ఘము.

రేచకాదులను తాను నిర్ణయించుకొనిన లెక్కకంటె యెక్కువగా చేయుట సంఖ్యాదీర్ఘము.

తనక్లిప్తముకంటె నెక్కువగాఁజేయుట దీర్ఘము.

తనక్లిప్తముకంటె తక్కువగాఁ జేయుట సూక్ష్మము. దీనికి వైకృత ప్రాణాయామ మనియును పేరు కలదు.

అవ. త్రివిధప్రాణాయామములను వచించి, చతుర్థ ప్రాణాయామ లక్షణమును బోధించుచున్నారు.—

51. బాహ్యాభ్యన్తర విషయాక్షేపీ చతుర్థః.

తా. బాహ్యాభ్యంతరవిషయము లైన రేచక పూరకములను విడుచుట చతుర్థప్రాణాయామ మనఁబడును.

వి. రేచక పూరకములను విడిచి, కుంభకమునందుమాత్ర ముండుట చతుర్థప్రాణాయామ మనఁబడుచున్నది, దీనికే కేవలకుంభక మనియుఁ పేరు కలదు. ఇదియే యోగాంగముగ నున్నది.

అవ. ప్రాణాయామ ప్రయోజనమును జెప్పుచున్నారు.—

52. తతః క్షీయతే ప్రకాశావరణమ్.

తా. ప్రాణాయామము చేయుటవలన చిత్తమునందలి సాత్త్వికభాగమును ఆవరించుకొనియుండు మలిసము నశించును.

వి. చిత్తముయొక్క సాత్త్వికభాగమును చుట్టుకొని పాపమును చేయునట్లు ప్రేరేపించు మలినము, ప్రాణాయామమువలన నివర్తించును.

అవ. ప్రాణాయామ విశేషప్రయోజనమును వచించుచున్నారు.—

53. ధారణాసు యోగ్యతా మనసః.

తా. ధారణయందు చిత్తమునకు స్థైర్యము కలుగును.

వి. ప్రాణాయామముచేత నిర్మలమై యుండు చిత్తము యెచ్చట నిల్పిన నచ్చట నిల్చుశక్తి కలిగినతర్వాత, ఇక చెప్పఁబోవు ధారణయందు మనస్సు స్థిరమై నిలుచును.

(ప్రాణాయామ లక్షణమును విపులముగా "హఠయోగ ప్రదీపిక" యందుఁ గనంబడును).

అవ. ప్రత్యాహార లక్షణమును నిరూపించుచున్నారు.—

54 స్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేన్ద్రియాణాం ప్రత్యాహారః.

తా. ఇంద్రియములను తమతమ విషయములయందు పోనీక, నిర్మల చిత్తమునకు మఱల్చి, తమతమ స్థానమున నిల్పుటయే ప్రత్యాహారము.

వి. చక్షురాదీంద్రియములు తమతమవిషయములైన రూపాదివిషయములనుండి చిత్తమునం దైక్య మగునట్లు చేయుటయే ప్రత్యాహార మనఁబడును.

అవ. ప్రత్యాహారముయొక్క ఫలమును జెప్పుచున్నారు.—

55. తతః పరమావశ్యతేన్ద్రియాణామ్.

తా. ప్రత్యాహారాభ్యాసమువలన యింద్రియములు స్వాధీన మగును

వి. ప్రత్యాహారము సిద్ధించిన యోగికి యింద్రియములు వశమై యుండును. ఈ యింద్రియవ్యాపారములు వశ మైనతర్వాత చిత్తచాంచల్యము లేక పోవును. ధ్యానమునందు చిత్తము స్థిరముగా నిల్చును.

పాతంజలయోగశాస్త్రమునందు

సా ధ న పా ద ము.

స మా ప్త ము.



# హ ఠ యో గ ప్ర దీ పి క

ఇందు హఠయోగము చేయుటవలన ప్రయోజనమును, అష్టాంగములగు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి లక్షణములును, ఆహార నియమములును, ఆసనప్రయోజనమును, ఆసనభేదములను ప్రాణాయామాభ్యాస లక్షణమును ప్రాణాయామ భేదములును, ప్రాణాయామ సాకర్యార్థము ధౌతికర్మ, వస్తికర్మ, నేతికర్మ, త్రాటకకర్మ, నౌలి, కపాలభాతియను షట్కర్మల లక్షణములును, వాని గుణములును, కుంభకభేదములును, కుండలీ ప్రయోజనమును, కుండలీ ప్రబోధ ప్రయోజనమును, ఖేచరీముద్రా స్వరూపమును, బంధత్రయ ప్రయోజనమును, రాజయోగ మహిమయు, ప్రాణలయ క్రమమును, శాంభవీ ముద్రాప్రభావము, ప్రత్యాహారభేదములు, ధారణాభేదములు, ధ్యానభేదములు, బ్రహ్మజ్ఞాని లక్షణము మొదలగు యోగి అనుసరింపవలసిన సమస్త విషయములను సులభశైలితో వ్రాయబడి 128 ఆసనపటములును కలిగి మిక్కిలి ఆకర్షణీయమై యున్నది. యోగాభ్యాసము చేయువారికి ఈ గ్రంథము కల్పవృక్షమువంటిదని చెప్పుట అతిశయోక్తికాదు గ్లేజు కాగితములతో 216 పేజీలు కలిగి క్యాలికో బైండు చేయబడినది. వెల రూ. 2-8-0

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# పాతంజలయోగశాస్త్రము.

## 3. విభూతిపాదము.



శ్లో. యత్పాదపద్మస్మరణా దణిమాది విభూతయః,
భవన్తి భావినా మస్తు భూతినాథ స్స భూతయే.

అవ. ధారాలక్షణమును వచించుచున్నారు —

1. దేశబన్ధ శ్చిత్తస్య ధారణా.

తా. నాభిచక్రాది ప్రదేశములయందు చిత్తమును చలింపక నిల్పుట ధారణ యనఁబడును.

వి. యోగాభ్యాసి ప్రథమమునందు అభ్యాసము నిమిత్తమై యేవస్తువు నందుఁగాని, ఏ స్థలమునందుగాని చిత్తమును నిల్పవలయును. ఇట్లు నిల్పినచో చిత్తమునకు చలనము కలుగదు. అట్టి స్థితి ధారణ యనఁబడును.

ద్వితీయపాదమునందు సంగ్రహముగాఁ జెప్పిన ధారణాది అంగత్రయములను నిరూపించుటకొఱకును, మఱియు సంయమాదులను బోధించుటకొఱకును తలంచినవారై, యీ పాదమునందు పూర్వోక్తధారణాది ప్రయోజన విశేషమును (బాహ్యాభ్యంతర సిద్ధులను) క్రమముగాఁ జెప్పుటకు నిశ్చయించిరని తెలియునది.

అవ. ధ్యానక్రమమును నిరూపించుచున్నారు.—

2. తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్.

తా. ధారణావస్థలయందు జ్ఞానముయొక్క ధ్యానేతర వస్తువులను చిత్తమున రానీక చేయుటయే ధ్యాన మనఁబడుచున్నది.

వి. ధారణయొక్క స్థలమున తాను ధ్యానించు వస్తువునకంటె వ్యతిరిక్తమైన దానిని రానీయక, తాను ధ్యానించువస్తువును మాత్రమే భావించుట ధ్యానము. అనఁగా, ధారణయందు బుద్ధినియుంచి మఱవకుండుట.

అవ. సమాధి లక్షణమును జెప్పుచున్నారు.—

3. తదే వార్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్య మివ సమాధిః

తా. ముందు జెప్పిన ధ్యానము ధ్యానించు వస్తువుయొక్క స్వరూపమై, ఆ ధ్యానము లేకుండుటయే సమాధి యనఁబడును.

వి. ధ్యానము, ధ్యానించు వస్తువుయొక్క స్వరూపముగా పరిణమించి, నేను ధ్యానించుచున్నా ననుటకూడ మఱచిపోవుటయే సమాధి యనఁబడు చున్నది.

అవ. యోగాంగ త్రయముయొక్క సంకేతనామమును వచించు చున్నారు.—

4. త్రయ మేకత్ర సంయమః.

తా. ఒకే విషయమందు ధారణ ధ్యానము సమాధియను నీ మూఁడును కూడియుండుట సంయమ మనఁబడును.

వి. ధారణా ధ్యాన సమాధులు కూడియుండుటకు సంయమ మని నామము. ఈ మూఁడును యోగమునకు అంతరంగ సాధనములై యున్నవి.

అవ, సంయమసిద్ధియొక్క ఫలమును నిరూపించు చున్నారు.—

5. తజ్జయాత్ప్రజ్ఞాలోకః.

తా. సంయమముయొక్క అభ్యాసము స్థిర మగుటవలన తెలియవలసిన స్వరూపము తెలియును.

వి. సంయమమును చక్కఁగా నభ్యసించి యుండువానికి తాను చూడఁ గోరిన సకలవస్తు స్వరూపములును చక్కఁగా కనఁబడును. అనఁగా, ఇది దృఢమైనచో నే వస్తువును అడ్డుబాటులేక గోచర మగు నని భావము.

అవ. సంయమమును వుపయోగించు పద్ధతిని బోధించుచున్నారు.

6. తస్య భూమిషు వినియోగః.

తా. ఆ సంయమమును చిత్తముయొక్క స్థూలాది భూమికలయందు వుపయోగింపఁదగి యున్నది.

వి. చిత్తమునం దొకటికన్న నొకటి సూక్ష్మమై యుండు భూమికల యందు క్రమముగా అభ్యాసము చేయు చుండవలయును. అట్లు చేయని యెడల సంయమముచేఁ గలుగు ప్రయోజనములను పొందనేరఁడు. (ఈ భూమి కలనుగూర్చి ఇదేపాదము 9-వ సూత్రమున వివరింపఁబడును.)

అవ. సాధన పాదమునందు యోగముయొక్క అయిదంగములను చెప్పి, తక్కిన మూఁడంగములను చెప్పనిదానికి కారణమును వచించు చున్నారు.—

7. త్రయ మన్తరఙ్గం పూర్వేభ్యః.

తా. యమాది యైదంగములకంటెను. ధారణాది మూఁడంగములు సంప్రజ్ఞాతసమాధికి అంతరంగములు.

వి. పరంపరగా సమాధికి ఉపయుక్తములైన యమాదియై దంగములు సంప్రజ్ఞాత సమాధియొక్క బాహ్యాంగము లనియును, ధారణాది మూఁడంగ ములు సంప్రజ్ఞాత సమాధియొక్క అంతరంగము లనియును, తెలియఁదగినది.

మఱియు యోగాంగముల నెనిమిదింటిని రెండవపాదమున వివరించి, అందు ఆయిదంగముల లక్షణములను ఆ పాదమునందు జెప్పి, మిగత మూఁడంగములను ఆచోట చెప్పకపోయిన కారణ మేమనఁగా, ఈ మూఁడవపాదమునందు యోగముయొక్క దృఢీకరణమును చెప్పుటచేత నిచ్చట వానిని చెప్పఁబడు చున్నదని గ్రహించునది.

అవ. ధారణాది మూఁడంగములను నిర్బీజసమాధికి బహిరంగములని చెప్పుచున్నారు.—

8. తదపి బహిరఙ్గం నిర్బీజస్య.

తా. అసంప్రజ్ఞాత సమాధికి ధారణాదులు మూఁడును బహిరంగములు.

వి. ధారణాదులు నిర్బీజసమాధికి (నిరాలంబన రూపమైన అసంప్రజ్ఞాత సమాధికి) బహిరంగములై యుండుటవలన, ఈ సంయమమున నుపయుక్తమైన సమాధి సబీజ మనఁబడుచున్నది.

అవ. యోగసిద్ధిని జెప్ప నుపక్రమించిన వారై ప్రథమమున నిరోధ పరిణామమును బోధించుచున్నారు.

9. వ్యుత్థాన నిరోధ సంస్కారయో రభిభవ ప్రాదుర్భావౌ నిరోధలక్షణ చిత్తాన్వయో నిరోధపరిణామః.

తా. చిత్తభూమికలైన క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము అను నీ యైదిటిలో, క్షిప్త మూఢ విక్షిప్తములు మూఁడును వ్యుత్థాన మనియును; ఏకాగ్ర నిరుద్ధ భూమికలు రెండును నిరోధ మనియును తెలియఁదగినది. అనఁగా, ఈ వ్యుత్థాన నిరోధములవలనఁ గలిగిన వాసనలయందు వ్యుత్థాన వాసనా తిరస్కారము నిరోధ సంస్కారము యొక్క ఆవిర్భావ మనియును; ఆ నిరోధ సంస్కారముయొక్క ప్రారంభమునందుండు చిత్తమునకు నిరోధ పరిణామ మనియును భావము.

వి. చిత్తమునందు రజోగుణోద్రేకముచే బహిర్ముఖమై సుఖదుఃఖాదులయందు ప్రేరేపింపఁబడి చంచలమై యుండు చిత్తముయొక్క స్థితి క్షిప్తము.

చిత్తమునందు తమోగుణోద్రేకముచే కృత్యాకృత్యవివేకము లేక క్రోధాదులచే విరుద్ధ కార్యములయందు ఆసక్తి కలిగియుండు చిత్తముయొక్క స్థితి మూఢము.

చిత్తమునందు సత్త్వగుణోద్రేకముచే సుఖసాధనములైన విషయములయందు ప్రవర్తించి సుఖమయమై యుండు చిత్తముయొక్క స్థితి విక్షిప్తము.

చిత్తమునందు సత్త్వగుణ మధికమై బాహ్యమునందు ప్రసరింపనీయకుండు చిత్తముయొక్క స్థితి ఏకాగ్రము.

చిత్తమునందు సత్త్వగుణోత్కర్షముచే ఆనందమై యుండు చిత్తముయొక్క స్థితి నిరుద్ధము.

ఇందు మొదటి మూఁడు భూమికలును సమాధికి వుపయుక్తములు కావు. మిగిలిన రెండు భూమికలును సమాధికి వుపయుక్తములు. (ఈ విషయమును 1-వ పా, 2-వ సూత్రమున చూడఁదగును.)

అవ. నిరోధ పరిణామమును బొందిన చిత్తమునకు కలుగు ఫలమును జెప్పుచున్నారు.—

## 10. తస్య ప్రశాన్తవాహితా సంస్కారాత్.

తా. నిరోధ పరిణామమును బొందిన చిత్తమునకు ఆ నిరోధ పరిణామ సంస్కార బలమువలన కేవల సత్త్వగుణ ప్రవాహము కలుగుచున్నది.

వి. నిరోధ పరిణామబలముచే చిత్తక్లేశములచేఁ గలుగు చంచలము నశించి కేవలసత్త్వగుణ సమానమైన సజాతీయ సత్త్వోత్కృష్ట ప్రవాహము కలుగును.

అవ. సమాధి పరిణామమును నిరూపించుచున్నారు.—

11. సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధి పరిణామః.

తా. అనేక విషయములయందు పరిణమించు చిత్తధర్మము సర్వార్థత యనఁబడుచున్నది. ఒకే విషయమునందు పరిణమించు చిత్తధర్మము యేకాగ్రత యనఁబడుచున్నది. సర్వార్థతా పరిణామముయొక్క (1) లయమును, యేకాగ్రతా పరిణామముయొక్క ఉదయమును కలుగుచుండఁగా, సమాధి పరిణామ మని (2) చెప్పఁబడుచున్నది.

వి. ఇదివఱకుఁ జెప్పిన నిరోధ పరిణామమునకును, ఈ సమాధి పరిణామమునకును భేద మెయ్యది యనఁగా.

అనుభవముచేఁ గలిగిన వ్యుత్థాన సంస్కార రూపముయొక్క వాసనలను త్యజించుచు, నిరోధరూప సంస్కారవాసనయందుఁ బ్రవేశించుట నిరోధ పరిణామము.

నానా విషయాకారమై పరిణమించు చిత్తధర్మముచే ననుభవించుట యొక్క (1) లయమును. సత్త్వోత్కృష్టమునందు సుఖమయమై యుండు అనుభవముయొక్క ఆవిర్భావమును సమాధి పరిణామము. (2)

అవ. ఏకాగ్రతా పరిణామమును బోధించుచున్నారు.—

12. శాన్తోదితౌ తుల్య ప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతా పరిణామః.

తా. చిత్తమునకు శాంతము కలుగుచుండఁగా సమానములైన వృత్తి విశేషములు ఏకాగ్రతా పరిణామ మనఁబడుచున్నది.

వి. ఏకాకారమై యుండు చిత్తముయొక్క కేవల సత్త్వోత్కృష్ట ప్రవాహమునందు మొదటి స్థితియొక్క శమనమును, రెండవ స్థితియొక్క

ఉదయమును, ఇట్లుగా స్థితి కలుగుచుండుటయే ఏకాగ్రతా పరిణామ మనఁబడును.

ఎట్లనఁగా:—బహుదూరమైన మార్గమునందు నడచి పోవువానికి నడచిపోయినమార్గము నిలిచిపోయినట్లును, ముందుమార్గమునందు తాను ప్రవేశించు చుండునట్లును తెలియఁదగినది.

అవ. పరిణామ భేదములను చెప్పుచున్నారు.—

13. ఏతేన భూతేన్ద్రియేషు ధర్మలక్షణావస్థా పరిణామా వ్యాఖ్యాతాః.

తా. పైని జెప్పఁబడిన నిరోధసమాధి, ఏకాగ్రతా పరిణామముల నిరూపణచేత; భూతములయందును, ఇంద్రియములయందును, ధర్మ పరిణామ మనియును, లక్షణపరిణామ మనియును, అవస్థాపరిణామ మనియును వివరింపఁబడిన దగుచున్నది.

వి. ఎట్లనఁగా:—స్వభావమై యుండు ధర్మికి, ముందున్న ధర్మము పోయి వేఱొక ధర్మము కలుగుట ధర్మ పరిణామము. అనఁగా, మన్ను రూపమైన ధర్మికి ముందున్న ముద్దరూపమైన ధర్మముపోయి ఘటరూపమైన వేఱొక ధర్మము కలుగుచున్నది; అది మట్టికి ధర్మ పరిణామ మనఁబడును. ఇది నిరోధ పరిణామమునకు ప్రతిగా నున్నది.

ఆ ఘటము ముందు మట్టిచే కప్పఁబడియుండెను, అది మట్టిలోనుండి బైటికివచ్చెను, బైటవచ్చినది నష్టమై పోయినది అనుట ఘటమునకు లక్షణా పరిణామము. ఇది సమాధి పరిణామమునకు ప్రతిగా నున్నది.

ప్రతి క్షణమునందును ప్రతివస్తువునకును పరిణామము కలుగుచున్నది. ఎట్లన, ఒక వస్తువును మనము చూచునప్పుడు దానియందు అంతకుముందున్న స్థితి, ఆ చూచినప్పుడు లేదు. ఇట్లు చూచినక్షణమందున్న స్థితి అనంతర క్షణమునందు లేదనుట ప్రతిదానికిని అవస్థాపరిణామ మనఁబడును. ఇది ఏకాగ్రతా పరిణామమునకు ప్రతిగా నున్నది.

ఇట్లు చిత్త పరిణామములను ఇతర స్థలములయందును అన్వయించు కొనవలయును. దీనివలన చిత్తమునందలి పరిణామ లక్షణములు తెలియును.

అవ. ధర్మియొక్క లక్షణ మెట్టిదని వచించుచున్నారు.—

## 14. శాన్తోదితా వ్యపదేశ్య ధర్మానుపాతీ ధర్మీ.

తా. తమతమ పనులను చేయుటకు సామర్థ్యము లేక విశ్రాంతిని బొందియుండు నప్పుడును, తమతమ పనులను చేయుచుండు నప్పుడును, ఇట్టి పనులను చేయఁగల మని నిర్ణయించుటకు అవశ్యకమై యుండునప్పుడును వుండునట్టి ధర్మములను ఆశ్రయించి యుండునది ధర్మియనఁబడుచున్నది.

వి. తమతమ పనులను చేయుటకు శక్తిచాలక శాంతమై యుండునట్టి ధర్మములను, తమతమ పనులను చేయుచుండు ధర్మములను, ఇట్టి పనులనే చేయఁగలమని నిర్ణయించుటకు అసాధ్యమైయుండు ధర్మములను యెడఁబాయక ఆశ్రయించి యుండునది ధర్మియనఁబడును.

ఎట్లనఁగా:—బంగారమనెడు ధర్మి ఘట్టిరూపమైన ధర్మమును వహించి యుండు కాలమునందు, ఉంగరము రూపమైన ధర్మము లేక యుండినట్లును, మఱల అదే ఉంగరము రూపమైన ధర్మమును బొందియుండు కాలమునందు ఘట్టిరూపమైన ధర్మములేక యుండినట్లును; ఈ ఘట్టియందును, ఉంగరము నందును సహితము యెడఁబాటులేక యేకరూపమై యుండు బంగారము ధర్మి యనఁబడుచున్నది.

అవ. ఒక్క ధర్మికే అనేక పరిణామములు కలుగునని చెప్పుచున్నారు.

## 15. క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః.

తా. ధర్మికి యే క్రమము గలదో, అట్టి క్రమమునందు ప్రతిక్షణమునను వేఱుగాఁ గనఁబడుట పరిణామాంతర కారణ మనఁబడుచున్నది.

వి. పృథివియందు మొదట చూర్ణము రూపము, అనంతరము ఆ చూర్ణముకలననుండి ముద్దరూపము, తర్వాత దానివలననుండి కపాలములు.

అవల ఆ కపాలములవలననుండి ఘటము. ఇట్లు మట్టిరూపమైన ఒకే ధర్మమునందు అనేకపరిణామములు కనంబడుచుండుటవలన నొక ధర్మికి అనేక పరిణామములు కలుగుటకు సందేహము లేదు. ఆకారణమునుబట్టి ఇదేలాగున చిత్తమునకును, భూతములకును, ఇంద్రియములకును, అనేక పరిణామములు కల వని తెలియఁ దగినవి.

అవ. పరిణామములసంయమముచేత త్రికాలజ్ఞానము కల్గునని నిరూపించుచున్నారు. —

16. పరిణామత్రయ సంయమా దతీతానాగత జ్ఞానమ్.

తా. ఈ ధర్మికి ఈధర్మము, ఈ లక్షణము, ఈయవస్థ, అని పరిణామత్రయముయొక్క సంయమముచేతఁ గడచిపోయిన వస్తువుల విషయముల యందును జ్ఞానము కలుగును.

వి. ధర్మ లక్షణావస్థా పరిణామములవలన యోగికి ఈ వస్తువు ఈలాగున నుండెను, ఈలాగున నున్నది, ఈలాగున నగు నని వస్తువిషయక మైన త్రికాలజ్ఞానము కలుగును. అనఁగా భూతభవిష్యద్వర్తమానజ్ఞానము చక్కఁగాఁ గలుగును.

అవ. సకలజంతుభాషాజ్ఞానసిద్ధి కలుగుటకు ఉపాయమును చెప్పుచున్నారు.-

17. శబ్దార్థప్రత్యయానా మితరేతరాధ్యాసా త్సంకర స్తత్ప్రవిభాగ సంయమా త్సర్వభూతరుతజ్ఞానమ్.

తా. స్పష్టవర్ణాత్మకమైన శబ్దము, జాతి గుణ క్రియారూపమైన ఆ శబ్దముయొక్క అర్థము, ఆ స్పష్టమైన అర్థముచేఁ గలుగు జ్ఞానము, వీనియొక్క శబ్దార్థజ్ఞానములయందు ఒకదానిని వేఱొకదానినిగా బుద్ధికి తెచ్చుకొనుటవలన ఒకదానిలో నొకటి కలిసిపోవుచున్నది. అట్లు పోనీయక ప్రత్యేక

ప్రత్యేకముగా విభజన చేసి సంయమము చేయుటవలన సకలప్రాణులభాషా జ్ఞానము కలుగును.

వి. ఇది ఈశబ్దము, ఇది దీనియర్థమైన వ్యక్తి, ఇది ఈవ్యక్తియొక్క జ్ఞానము, అని వేర్వేఱుగా విభజనచేసి సంయమము చేయుటవలన మృగ పశు పక్షి సర్ప పిపీలికాదుల భాషాజ్ఞానము కలుగును.

ఎట్లనఁగా:—"గోవును తీసికొనిరా" అని చెప్పినప్పుడు, గోవు అను శబ్దమునకు గోస్వరూపమైన అర్థమనియు, ఈ అర్థమును జెప్పునది గోవు అను శబ్దమనియు, ఈ శబ్దార్థములు రెంటివలన గలిగినది ఈ జ్ఞానమనియు విమర్శలేక వీని నన్నిటిని అభేదముగనే తెలియునట్టివాఁడు, "ఇది గోవు" అను వ్యక్తికి వాచకమైన "గోవు" అనెడు శబ్దమనియు, ఈ "గోవు" అను శబ్దమునకు "గోవు" అను వ్యక్తిరూపమైన ఈ యర్థమనియు, ఈశబ్దార్థములను దెలియఁజేయు జ్ఞానమిది యనియు, పరస్పరము భేదమును దెలిసికొని వ్యవహరించుటలేదు. ఏలాగనఁగా, "గోవు" అనుచోట ఏది శబ్దము, ఏది అర్థము. ఏది జ్ఞానార్థమని వానిని అడిగినచో, నీమూఁడు ప్రశ్నలకును "గోవు" అని ఏకరూపమైన ఉత్తరమును చెప్పగలఁడుగాని, పరస్పరభేదమును దెలిపి ఉత్తర మీయఁగలవాఁడు కాఁడు. ఏలన, ఆ ఉత్తరము నిచ్చినవాఁడు శబ్దార్థ జ్ఞానములను అభేదముగాఁ దెలిసికొనినయెడల, శబ్దార్థజ్ఞానములు మూఁటికిని ఒకే ఉత్తరము నీయఁడు; కావున శబ్దార్థజ్ఞానములను వేర్వేఱుగా విభజించి సంయమము చేయుటవలన సకలజీవజంతువుల భాషలు బోధపడును.

అవ. పూర్వజన్మజ్ఞానసిద్ధి కలుగుట కుపాయమును జెప్పుచున్నారు.

౧౮. సంస్కారసాక్షాత్కరణాత్పూర్వజాతిజ్ఞానమ్.

తా. ద్వివిధములైన చిత్తసంస్కారములయందు సంయమము చేయుటచే కలుగు జ్ఞానమువలన, తనయందు తోఁచుచుండు సంస్కారములను విమర్శింపఁగా జన్మాంతరములయందు తనకుఁ గలిగిన జాతి మొదలగునవి గోచరించును.

వి. ద్వివిధ సంస్కారము లనఁగా.— జన్మ జన్మాంతరా ద్యనుభవములవలన చిత్తమునందు వాసనారూపమై నిలిచినది, ఇప్పుడు స్మృతిని కలుగఁజేయఁదగిన సంస్కారము లనియును, సుకృతదుష్కృతకర్మములను చేసి యుండుటవలన కల్గిన పుణ్యపాప పరిపాకమువలన సుఖదుఃఖములకుఁ గారణమైన జాత్యాయుర్భోగరూప మైన సంస్కారము లనియును రెండు విధములు.

ఈ రెండువిధము లైన చిత్తసంస్కారముల సంయమముచేఁ దాను పూర్వజన్మమునందు ఏజాతిప్రాణియై యున్నాది మొదలగునవి చక్కఁగాఁ దెలియును.

అవ. పరచిత్తజ్ఞానమును దెలిసికొనుట కుపాయమును జెప్పుచున్నారు.

19. ప్రత్యయస్య పరచిత్తజ్ఞానమ్.

తా. పరుల ముఖరాగాది భావములవలనఁ గలుగు జ్ఞానమునందు సంయమము చేయుటవలన వారి అభిప్రాయములు గోచరించును.

వి. అన్యులయొక్క మాటలు, నడవడికలు, ముఖవికాసము, మొదలగువానిని జాగ్రత్తగా కనిపట్టినయెడల వారియొక్క చిత్తమందలి అభిప్రాయము ఇట్టి దని చెప్పునట్టి జ్ఞానము కలుగును.

అవ. పరచిత్తజ్ఞానమును దెలియమికి కారణ మిట్టి దని వచించుచున్నారు.—

20. నత త్సాలమ్బనం తస్య విషయీభూతత్వాత్.

తా. ఆ పరపురుషులయొక్క ఆలోచన చేయు చిత్తవికారాదులు బాహ్యమున కనఁబడనీయక లోపలనే ఆలోచించు నప్పుడు, అట్టి దానిని సంయమమువలన కనిపట్టుటకుఁ గానేరదు.

వి. వీఁడు నల్లనిరంగు ఆలోచనయందున్నాఁడు, వీఁడు ఎఱ్ఱనిరంగు ఆలోచనయం దున్నాఁడు, అను నిట్టి విషయములతోఁ గూడి

యుండు పరులచిత్తము, ముఖరాగాదిభావములచే బైట గోచరింపబడుటవలన అచిత్తమందు సంయమమును చేయుట అశక్యము.

అవ. అదృశ్యకరణసిద్ధిని నిరూపించుచున్నారు.—

21. కాయరూపసంయమా ద్గ్రాహ్యశక్తిస్తంభే చక్షుః ప్రకాశసంయోగే ఽన్తర్ధానమ్.

తా. తన ఆకారాది విశిష్టస్వరూపమునందు సంయమము చేయుటవలన, ఇతరులు గ్రహింపదగిన శక్తికి ప్రతిబంధకము కలుగుటయే గాక, ఇతరుల దృష్టికి శరీరము కనబడక అదృశ్య మగును.

వి. తనయొక్క శరీరాద్యవయవములను సంయమము చేయుటవలన పరులకు తన శరీరమందలి రూపాదులు ప్రతిబంధక మగుటవలన (శరీరము) కనబడక అదృశ్య మగుచున్నది.

అవ. శబ్దాద్యదృశ్యకరణిలక్షణమును జెప్పుచున్నారు.—

22. ఏతేన శబ్దాద్యన్తర్ధాన ముక్తమ్.

తా. క్రింద జెప్పబడిన దేహాదృశ్యకరణోపాయముచేతనే శబ్దాదులను దెలియక చేయ నగును.

వి. అదృశ్యకరణోపాయముచేత శబ్ద స్పర్శ రస గంధములను అదృశ్యము చేయవచ్చును.—

అవ. మరణకాలము నెఱుంగునట్టి సిద్ధిని వచించుచున్నారు.—

23. సోపక్రమం నిరుపక్రమంచ కర్మతత్సంయమా దపరాన్తజ్ఞాన మరిష్టేభ్యో వా.

తా. కర్మము తనకు ఫలము నిచ్చుటకు ఉపక్రమించిన దనియును. తనకు ఫలము నిచ్చుటకు ఉపక్రమింపక యున్నదనియును రెండువిధములు. ఆ రెండువిధములకర్మములను సంయమము చేయుటవలన అరిష్టసూచనలు మరణకాలము ఇవి గోచరించును.

వి. ఫలము నిచ్చుట కుపక్రమించినది సోపక్రమకర్మము ముందు ఫలము నిచ్చుటకు మిగిలి యుండునది నిరుపక్రమకర్మము వీని సంయమము వలన మరణకాలము గోచరించును.

ఎట్లనఁగా:—ఉష్ణప్రదేశమునందు ఆరగట్టిన బట్టయొక్క తేమ శీఘ్రముగా నెండిపోవునట్లు, సోపక్రమకర్మము ప్రతిదినమును ఫలముల నిచ్చుటచేతను, దానికి విరోధమైన కర్మాచరణచేతను సహా శీఘ్రముగా క్షయించుచున్నది. శీతలప్రదేశమునందు మడతబెట్టియుంచినబట్ట నిదానముగా ఎండుచువచ్చునట్లు, నిరుపక్రమకర్మము కాలక్రమముచేతను దానికి వ్యతిరిక్తమైన కర్మము చేయుటచేతను, సావకాశముగా క్షయించుచున్నది. ఈ ద్వివిధములైన కర్మలయందును సంయమము చేయుటవలనఁ దనకు ఈ దేశమునందు, ఈ స్థలమునందు, ఈ వేళయందు, ఈరీతిగా శరీరవియోగము కలుగు నని నిస్సంశయముగాఁ దెలియును. అరిష్టసూచనలవలనను మరణకాలము గోచరించును. అసూచనలు మూఁడువిధములు.

(1) తర్జనివ్రేళ్లతోఁ (చూపుడువ్రేళ్లతో) చెవులను గట్టిగా మూసికొనినయెడల చెవిలోపలి శబ్దము వినఁబడకుండుట, నాలుకను చాఁచి చూడఁగా నాలుకకొన కనఁబడకుండుట, దీపమును జూచిన రెండు శిఖలుగాఁ గనఁబడుట, ఇవి అధ్యాత్మిక (దేహమునకు సంబంధమైన) అరిష్టము లనఁబడును.

(2) వికారరూపములు కనఁబడుట, సూర్యునిజూచిన ముక్కలైనట్లును తూట్లుపడినట్లును కనఁబడుట, వీనిచేతను మరణకాలము సమీపించిన దని తెలిసికొనవచ్చును. ఇవి ఆధిదైవికారిష్టము లనఁబడును.

(8) ఎన్నఁడు చూడనట్టి స్వర్గాది లోకాంతరముల పదార్థములు కనఁబడుట, ఇవి మొదలైనవానిచేతను అంత్యకాలము సమీపించిన దని యెఱుంగవచ్చును. ఇవి ఆధిభౌతికము లనఁబడును.

అవ. చిత్తపరికర్మసిద్ధిని నిరూపించుచున్నారు. —

24. మైత్ర్యాదిషు బలాని.

తా. మైత్రి, ముదిత, కరుణ, ఉపేక్ష, అను వీనిని సంయమము చేయుటవలన ఆ మైత్ర్యాదులు వృద్ధి యగును.

వి. మైత్ర్యాదుల సంయమమువలన తాను అభ్యాసము చేయక పోయినను అవి వృద్ధి యగును. (ఈ విషయము 1-వ పా. 33-వ సూత్రమున వివరింపఁబడియున్నది.)

అవ. దేహబలమును తాను కోరినట్లుగాఁ జేసికొనుట కుపాయము జెప్పుచున్నారు.—

25. బలేషు హస్తిబలాదీని.

తా. ఏనుఁగు, సింహము, మొదలగువాని బలమునందు సంయమము చేయుటవలన, ఏనుఁగు సింహము మొదలగువాని బలము కలుగును.

వి. గజ సింహ హనుమ ద్గరుడ శరభ గండభేరుండ తిమి తిమింగల వాయ్వాది మహాశక్తిగలవానియందు సంయమము చేసినయెడల, తాను చేసిన దానియొక్క బల పరాక్రమ సాహస వేగాదులు కలుగును.

అవ. పరోక్షముగా నుండు వస్తువులను గాంచుటకు ఉపాయమును వచించుచున్నారు.—

26. ప్రవృత్త్యాలోకన్యాసా త్సూక్ష్మ వ్యవహిత విప్రకృష్ట జ్ఞానమ్.

తా. విషయవతి, జ్యోతిష్మతి అను విషయములయందు, సాత్త్విక ప్రకాశదృష్టిచేఁ జూచి సంయమము చేయుటవలన పరమాణువు మొదలు గాఁగల అతిసూక్ష్మమైన వస్తువులును, భూమిలో నిక్షేపము చేసియుండు నవియును, మేరువు మొదలగు పర్వతముల వెనుకటి భాగమునందు కనఁబడక యుండు సిద్ధరసాది వస్తువులును గోచరించు జ్ఞానము కలుగును.

వి. విషయవతీ జ్యోతిష్మతులచే నుత్కృష్టమైన చిత్తేంద్రియముల యందు అనాదివిషయములను జేర్చికొని సంయమము చేయుటవలన అతి సూక్ష్మమైనవియును, భూమిలోనివియును దూరమునందు కనఁబడకుండు నవియును, మేరువు పశ్చాద్భాగమునందుండు సిద్ధమూలికాదులును గోచరిం చును. (1-వ పా, 35-వ సూత్రమున విషయవతిని గురించియు, 36-వ సూత్రమున జ్యోతిష్మతిని గురించియు చెప్పఁబడియున్నది).

అవ. లోకాంతర జ్ఞానసిద్ధిని చెప్పుచున్నారు.—

## 27. భువనజ్ఞానం సూర్యసంయమాత్.

తా. సూర్యునియందు సంయమము చేయుటవలన భూర్భువాది చతుర్దశలోకముల జ్ఞానము కలుగును.

వి. ప్రకాశమయుఁడైన సూర్యునియందు చేయు సంయమము వలన భూలోక, భువర్లోక, సువర్లోక, మహాలోక తపోలోక, జనలోక, సత్యలోకము లగు ఊర్ధ్వలోకములయొక్కయు; అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళము లగు అధోలోకములయొక్కయు సకలవస్త్వాదిజ్ఞానము గోచరించును.

అవ. గ్రహనక్షత్రజ్ఞాన సిద్ధిని చెప్పుచున్నారు.—

## 28. చన్ద్రే తారావ్యూహజ్ఞానమ్.

తా. చంద్రునియందు సంయమము చేయుటవలన నక్షత్ర సమూహముయొక్క జ్ఞానము సిద్ధించును.

వి. ప్రకాశాత్మకుండైన చంద్రునియందు సంయమము చేయుట వలన భౌతికవస్తువులు (సకలగ్రహనక్షత్రములు) గోచరించును.

అవ గ్రహనక్షత్ర సంచార జ్ఞానసిద్ధిని నిరూపించుచున్నారు.—

29. ధ్రువే తద్గతిజ్ఞానమ్.

తా. ధ్రువునియందు సంయమము చేయుటవలన అగ్రహనక్షత్రముల సంచారజ్ఞానము కలుగును.

వి. గ్రహనక్షత్రములకు ప్రధానమైనట్టియు ధ్రువనక్షత్రమునందు సంయమము చేయుటవలన గ్రహ నక్షత్రాదుల సంచారాదులు గోచరమగును.

అవ. శరీరాంతర కోశాది జ్ఞానసిద్ధిని చెప్పుచున్నారు.—

30. నాభిచక్రే కాయవ్యూహజ్ఞానమ్.

తా. నాభిచక్రమునందు సంయమము చేయుటవలన కాయవ్యూహజ్ఞానము కలుగును.

వి. దేహములోపలి నాభిచక్రమునందు సంయమము చేయుటవలన రస మల ధాతు నాడీ చక్రకోశములయొక్క సమస్తస్వరూపములను చక్కగా గోచరించును.

అవ. క్షుత్పిపాసానివారణసిద్ధిని వచించుచున్నారు.—

31. కణ్ఠకూపే క్షుత్పిపాసా నివృత్తిః.

తా. కంఠము లోపలిభాగమును సంయమము చేయుటవలన ఆకలి దప్పులు నివారణ మగును.

వి. కుత్తుక లోభాగమునందు ప్రాణాదులస్పర్శచే ఆకలి దప్పులను కలుగఁజేయు గుంటగా నుండు ప్రదేశమునందు సంయమము చేయుటవలన ప్రాణాదుల స్పర్శము తప్పిపోయి క్షుత్పిపాసానివృత్తి యగును.

అవ. దేహస్థైర్యసిద్ధిని జెప్పుచున్నారు.—

32. కూర్మనాడ్యాం స్థైర్యమ్.

తా. కుత్తుక దిగువభాగము నందుండు కూర్మనాడియందు సంయమము చేయుటవలన స్థైర్యము కలుగును.

వి. కూర్మనాడీ సంయమవలన దేహమునకును, శరీరములోపలి కోశ ధాతు నాడీచక్రాదులకును స్వస్థత కలుగును.

అవ. దేవతాసిద్ధపురుష సందర్శనసిద్ధిని చెప్పుచున్నారు.—

33. మూర్ధ జ్యోతిషి సిద్ధదర్శనమ్.

తా. శిరస్సులోపల బ్రహ్మరంధ్ర మను స్థలమున ప్రకాశాత్మకమైన సుషుమ్నాంతమందుండు మహాతేజస్సునందు సంయమయి చేసినయెడల సిద్ధపురుషులు మొదలుగాఁగల మహాత్ములదర్శనము కలుగును.

వి. సర్వగుడియందుండు అఖండజ్యోతియొక్క ప్రభ, వాకిలియొక్క రంధ్రముచే బైటప్రసరించునట్లు, శిరస్సులోపల సహస్రారమునందు జ్యోతిర్మయమై యుండు శుద్ధసాత్త్విక ప్రకాశము సహస్రారముయొక్క క్రింది భాగమునందుండు బ్రహ్మరంధ్రముద్వారా బైటప్రసరించుచుండును. ఆ ప్రభయందు సంయమము చేయుటవలన, అంతరిక్షమునందు సంచరించుచుండు దేవతలు, సిద్ధపురుషులు మొదలగు మహాత్ముల దర్శనమును, వారితో సంభాషించుటయును గలుగును. మఱియు ఆ ప్రదేశమున చిత్తమునందు సంస్కారరూపమైయుండు దివ్యులయందు సంయమము చేయుటవలన యోజనము నందైనను గాని తాను చూచినట్టి గతించినవారిని చూడనగును.

అవ. సర్వజ్ఞత్వ సిద్ధినొందుట కుపాయమును జెప్పుచున్నారు.—

34. ప్రాతిభాద్వా సర్వమ్.

తా. ప్రతిభయందుఁగాని, ఈ ప్రతిభయొక్క సంబంధమైన ప్రాతిభయందుఁగాని, సంయమము చేయుటవలన సమస్తమును గోచర మగును.

వి. చిత్తముయొక్క సత్త్వభాగమునందు నెలకొని యుండు చిత్తుయొక్క ప్రభ (చిత్ప్రతిభ) ప్రతిభ యనఁబడును. అనఁగా, జ్ఞాతృత్వము, లేక శుద్ధజ్ఞానము, లేక ప్రతిబింబము ప్రతిభ యనఁబడుచున్నది.

ఈ ప్రతిబింబమువలన అంకురించుచుండు ప్రకాశకిరణములు (బుద్ధికి అనుద్దేశ్యమై తక్షణమందు పుట్టుజ్ఞానము) ప్రాతిభ యనఁబడును. ప్రతిభ యందుఁగాని, ప్రాతిభయందుఁగాని సంయమము చేయుటవలన సకల విషయ వస్తు విచారములును చక్కఁగాఁ దెలియును.

బ్రహ్మరంధ్రమునకు పైగను, సహస్రారమునకు దిగువను, చిత్తము యొక్క సత్త్వభాగమును, బ్రహ్మరంధ్రప్రాంతము రాజసభాగమును బ్రహ్మరంధ్రమునకు క్రింద తామసభాగమును నెలకొనియున్నది. ఈ ప్రతిభాగము నందును పరంపరగా చిత్ప్రభ చేరియున్నది. వీనివలన ప్రతిప్రభలు బయలు పడుచున్నవి. చిత్సంబంధమైన ప్రతిప్రభకును ఆ ప్రభను పొందియుండు వస్త్వనుగుణముగా జ్ఞానము కలిగియున్నది. ఈ జ్ఞానములు అంతఃకరణములై యున్నవి. ఎట్లనఁగా, శుద్ధసత్త్వభాగప్రభకు ప్రజ్ఞ యనియును, జ్ఞానమనియును; సత్త్వభాగప్రభకు బుద్ధి యనియును; రాజసభాగప్రభకు మనస్సనియును; తామసభాగప్రభకు అహంకార మనియును; వీనియందంతయు అనాదిగా నెలకొనియుండునట్టియు, నెలకొనుచు వచ్చుచుండునట్టియు, సంస్కారరూపమైన చిహ్నములుగల భాగములకు చిత్తమనియును; ఈ శుద్ధసాత్త్వికాది భాగములకు వీనియొక్క స్వభావానుసారమై జ్ఞాతృత్వాది నామములు కలిగియున్నవి. వీనికన్నిటికి అంతఃకరణమనియు, చిత్తమనియు వ్యవహారము కలిగి యున్నవని తెలియఁదగినది. వీనిలో జ్ఞాతృవను కరణమునకు త్రికాలజ్ఞానమును, బుద్ధికి వర్తమాన కాలజ్ఞానమును, మనస్సునకు భవిష్యత్కాలజ్ఞానమును, చిత్తమునకు భూతకాలజ్ఞానమును, అహంకారమునకు అజ్ఞానమును, ఇట్లు అంతఃకరణములకు ప్రత్యేక ప్రత్యేకజ్ఞానము లున్నవి. వీనియందు బుద్ధ్యాదులు నాలుగును ప్రపంచాను వస్తువుయందే యుండుటవలనను, మఱియు తమతమ స్వరూపములను తెలిసికొనకయుండుట వలనను, ఇవి అంతఃకరణ రూపమైనను కనే యున్నవి. జ్ఞాతృవు అంతఃకరణమైనను ప్రపంచవిషయములకు సాక్షిభూతుఁడుగా నుండునేగాని, విషయ

ములయందు అనువర్తించుటలేదు గాన, అంతఃకరణ మనెడు వ్యవహారము లేదు. సూర్యోదయ కాలమునందు సూర్యునిచే కిరణములు అంకురించుచుండునట్లు జ్ఞాతృసంబంధమైన ప్రజ్ఞ అంకురించుచున్నది. ఈ అంకురప్రసరణ సదా కలిగి యున్నప్పటికిని, ప్రపంచవాసనయం దుండు బుద్ధికి బోధ మగుట లేదు.

[దీనిని గురుముఖముగా తెలిసికొనవలయును. ప్రాతిభసంయమమే గాయత్రీ విద్యారహస్యమై యున్నది].

అ. తనయొక్కయు యితరులయొక్కయు చిత్తవాసనల నెఱుంగుట నుపాయమును జెప్పుచున్నారు.—

35. హృదయే చిత్తసంవిత్.

తా. అంతఃకరణముల కాధారమైన శరీరముయొక్క మధ్యప్రదేశము నందు సంయమము చేయుటవలన తన చిత్తమునందలివియు, పరుల చిత్తమునందలివియు విషయములను తెలిసికొనవచ్చును.

వి. అంతఃకరణస్థానమైన హృదయ మధ్యభాగమునందు అధోముఖమై యుండు సూక్ష్మపుండరీకాకారమునందు సంయమము చేయుటవలన తనయొక్కయు, పరులయొక్కయు చిత్తమునందలి విషయజ్ఞానము (పూర్వ విహారవిద్య) కలుగును.

అ. జ్ఞాతృత్వజ్ఞానసిద్ధిని వక్కాణించుచున్నారు.—

36. సత్త్వపురుషయో రత్యన్తాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో భోగః పరార్థా త్స్వార్థసంయమాత్పురుషజ్ఞానమ్.

తా. కేవలము పరస్పరము వేఱుగానట్టి ప్రకాశమానమైన భోగ్యరూపమైన బుద్ధితత్త్వమునందును, స్వాత్మరూపుడైన భోక్తృవను జ్ఞాతృతత్త్వమునందును, తాను భోగ్యభోక్తృవనెడు జ్ఞానముయొక్క భేదము

తెలియుటు భోగ మనఁబడును. భోగ్యమైన బుద్ధి తత్త్వము తనకు ప్రయోజన మనెడి జ్ఞానమును విడిచి భోక్తృరూపుఁడైన పురుషునకు భోగమును సంపాదించి యీయఁగల ననెడి జ్ఞానముచే జ్ఞాతృవునందు సంయమము చేయుటవలన జ్ఞాతృరూపుఁడైన పురుషునియొక్క జ్ఞానము కలుగును.

వి. భోగ్య భోక్తృవులయొక్క పరస్పరభేదమును తెలియకయుండు నది భోగము. ఈ యజ్ఞానమును విడిచి బుద్ధి భోగ్యము, పురుషుండు భోక్తృవు అను వ్యవహారమునకు లోఁబడినవాఁడను తెలివిచే చిత్స్వరూపుఁడైన పురుషునియందు సంయమము చేయుటవలన స్వరూపుఁడైన పురుషుని జ్ఞానము కలుగును. ఇది భూమావిద్యకు సంబంధించినది.

అవ. స్వాత్మరూపుఁడైన పురుషుని సంయమముయొక్క ఫలమును జెప్పుచున్నారు.—

37. తతః ప్రాతిభ శ్రావణ వేదనాదర్శాస్వాద వార్తా జాయన్తే.

తా. ఆ స్వాత్మసంయమాభ్యాసమువలనఁ గల్గిన ప్రాతిభజ్ఞానము వలన దివ్యజ్ఞానము, దివ్యస్పర్శజ్ఞానము, దివ్యరూపజ్ఞానము, దివ్యరసజ్ఞానము దివ్యగంధజ్ఞానము కలుగును.

వి. స్వాత్మపురుష సంయమముచే ప్రాతిభజ్ఞానము కలిగి అందువలన లోకాంతరముల యందుండు దేవతలు మొదలగువారితో మాటలాడుట, వారిని తాఁకుట, వారిని చూచుట మొదలగునవి సంప్రాప్తించును.

[ప్రాతిభనుగూర్చి ఇదేపాదమున, 34-వ సూత్రమున చెప్పఁబడియె 35-వ సూత్రమున చెప్పఁబడినజ్ఞానము ఇహలోక సంబంధమును మాత్ర మనుసరించినది.]

అవ. ఇదివఱకుఁ జెప్పఁబడినట్టి సంయమసిద్ధులయొక్క గుణదోషములను నిరూపించుచున్నారు.—

38. తే సమాధా వుపసర్గా వ్యుత్థానే సిద్ధయః.

తా. ఇదివఱకుఁ జెప్పఁబడిన సిద్ధులవలనఁ గలిగిన ఫలములు, సమాధి యొక్క అభివృద్ధియందు విఘ్నరూపములై యున్నవి. సమాధిని విడిచిన కాలమున ఫలరూపములై యున్నవి.

వి. సమాధిని అభివృద్ధిచేసికొనుటకు సంయమముచేఁ గలిగిన ఫలములు విఘ్నకారులుగా నున్నవి. కాఁబట్టి నిరతిశయానంద రూపమైన కైవల్య మహాపదవిని యపేక్షించుయోగి, తుచ్ఛములైనట్టివియు అన్యులచే మహాపురుషుఁడని యనిపించుకొనుటకుఁ దగినట్టివియు నగు ఫలములను విడిచి సద్గతిని బొందు మార్గమునఁ బ్రవేశింపవలయును.

అవ. పరకాయప్రవేశ ప్రకారమును జెప్పుచున్నారు.—

39. బన్ధకారణ శైథిల్యాత్ప్రచార సంవేదనాచ్చ చిత్తస్య పరశరీరావేశః.

తా. చిత్తమును, పురుషుఁడును, అజ్ఞానమూలకమైన కర్మశేషముచేత శరీరమునందు బంధింపఁబడి యుండుటవలనను, దానికిఁ గారణమైన పుణ్యపాపకర్మములును నశించిపోవుటవలనను, చిత్తము హృదయప్రదేశమందలి ఇంద్రియములద్వారా విషయములయందు ప్రసరించునట్టి సామర్థ్యము కలదిగా నుండుటవలనను, పరశరీరమందు ప్రవేశించుచున్నది.

వి. చిత్తము పురుషుఁడు సహా వ్యాపకులై యున్నప్పటికిని, అజ్ఞానమూలకముగా కర్మమువలన భోగ్యభోక్తృవు లనిపించుకొని యుండుటకుఁ గారణమై యుండు పుణ్యపాపములు సమాధి బలమువలన క్షీణించుచువచ్చుటచేతను, చిత్తము ఈ ప్రదేశమునందు ఈ నాడిని ఆశ్రయించుకొని యున్నది, ఈ నాడులమార్గముగా ఇంద్రియములద్వారా విషయములను తెలిసికొనుచున్నది, మఱియు ఇంద్రియములను ప్రాణాదివాయువులను వహించుకొని యుండు నాడులు ఈలాగున నున్నవి; అని తన శరీరమందును పరప్రాణిశరీ

రములయందును సంచరించుచుండు సందర్భములనెల్లఁ జక్కఁగాఁ దెలిసి కొనుట కలదను; జీవించియుండు దేహములయందుఁ గాని, నిర్జీవకళేబరముల యందుఁ గాని, తన యిచ్ఛానుసారముగా చిత్తము ఇంద్రియ ప్రాణములతోఁ గూడ సుకరముగాఁ బ్రవేశించుచున్నది. సమాధిబలముచే పాపము నశించి మహా సుఖముయుండై మహిమగలవాఁడై యుండుటచే తాను ప్రవేశించిన ఘటమునందును అలాగే సుఖముగా నుండును. మఱల తన శరీరమునకు వచ్చును. ఇట్లు పరకాయప్రవేశమునకు కారణమైనది లింగదేహముగా నున్నది. ఈ లింగదేహముయొక్క స్వాధీనతను కలుగఁజేసికొనుట ఉపకోసల విద్యతో సంబంధించినదిగా నున్నదని తెలియునది.

అవ. ఉదానవాయు సంయమముయొక్క ఫలమును జెప్పుచున్నారు.

40. ఉదానజయాజ్జల పఙ్కకణ్టకాదిష్వసఙ్గ ఉత్క్రాన్తిశ్చ.

తా. ఉదానవాయువును సంయమముచేసి జయించుటవలన జలము నందును, అడుసునందును, ముండ్లయందును, సంబంధింపక యుండుట కలుగు చున్నది.

వి. ఉదాన వాయువును జయించుటవలన మహాప్రవాహాది జలము నందు మునిఁగిపోవకయు, మిక్కిలి అడుసు గల వాపీ కూప తటాకాదుల యందు పూడిపోవకయు, మిగుల సూక్ష్మమైన కొనలుగల ముండ్లు కత్తులు కటారులు మొదలగువానిపై నిలిచినను గ్రుచ్చుకొనకయు, వేనినంటకయు నుండును. ఈ ఉదానవాయువు, దేహముయొక్క వెనుకభాగమున భుజ శిరము మొదలు శిరస్సులోని సుడిగుంటవఱకు సమస్త వృత్తులను పైకి ఆక ర్షించు శక్తి గలది.

అవ. సమానవాయు సంయమముయొక్క ఫలమును జెప్పుచున్నారు.—

41. సమానజయాత్ప్రజ్వలనమ్.

తా. సమానవాయువును సంయమముచే జయించుటవలన, లేక స్వాధీనము చేసికొనుటవలన, లేక వశీకారమువలన, మహా తేజస్సువంటి కాంతి కలుగుచున్నది.

వి. సమానవాయు జయమువలన యోగియొక్క శరీరము అధిక ప్రకాశమానమైన దగుచున్నది. ఈసమానవాయువు, నాభిప్రదేశమునందు జఠరాగ్నిని ఆవరించుకొని భుజించిన అన్నరసమును పాకము చేయుచు నుండునది.

అవ. దూరశ్రవణ కారణసిద్ధిని చెప్పుచున్నారు.—

42. శ్రోత్రాకాశయో స్సంబన్ధ సంయమా ద్దివ్యం శ్రోత్రమ్.

తా. శ్రోత్రేంద్రియమును, అవకాశమై యుండు ఆకాశమును, వీనియొక్క దేశ దేశ భావలక్షణములు గల సంబంధమునందు సంయమము చేయుటవలన దివ్యశ్రోత్రేంద్రియము కలుగును.

వి. శ్రోత్రేంద్రియనాడికిని, ఆకాశమునకును గల సంబంధమునందు, అనఁగా, శ్రోత్రేంద్రియమును వహించియుండు నాడియు ఆకాశమును గూడియుండు స్థలమునందు సంయమము చేసినయెడల దేవతలకు గల శ్రోత్రేంద్రియ శక్తి లభించి అతిదూరమునందలి శబ్దములుసహా వినఁబడును.

అవ. ఆకాశగమనసిద్ధిని చెప్పుచున్నారు.—

43. కాయాకాశయో స్సంబన్ధసంయమా ల్లఘుతూల సమాపత్తే శ్చాకాశగమనమ్.

తా. శరీరాకాశ సంబంధమునందు సంయమము చేయుటవలన మిక్కిలి తేలికయై దూదివలెనె ఆకాశమునందు సంచరించుట కలుగుచున్నది.

వి. పాంచభౌతిక శరీరమును, నిరాధారమైన ఆకాశమును అగు వీని సంబంధమునందు (తనశరీరమును ఆక్రమించుకొనియుండు ఆకాశమునందు) చేయు సంయమమువలన దూదివలె శరీరము లఘు వగుచున్నది. అప్పుడు తన కిష్టమైనచోటికి ఆకాశమార్గముగాఁ బోవచ్చును.

అవ. సబీజనిర్బీజసమాధుల సిద్ధికొఱకు క్లేశకర్మనివృత్తి సిద్ధిని బోధించుచున్నారు.

### 44. బహిరకల్పితావృత్తి ర్మహావిదేహా తతః ప్రకాశావరణ క్షయః.

తా. శరీరముయొక్క వెలుపల శరీరాపేక్ష లేనట్టి చిత్తవృత్తి దేహాహంకారములు లేని మహావిదేహ మనఁబడుచున్నది. ఆ మహావిదేహమనెడు పేరుగల చిత్తవృత్తియందు సంయమము చేయుటవలన, ప్రకాశరూపమైన చిత్తమును చుట్టుకొనియుండు మలినరూపమైన క్లేశకర్మములు నశించిపోవుచున్నవి.

వి. శరీరాహంకారములతోఁ గూడియుండు చిత్తముయొక్క బాహ్యవృత్తి కల్పిత మనఁబడుచున్నది. శరీరాహంకారములను విడిచియుండు చిత్తముయొక్క బాహ్యవృత్తి మహావిదేహ మనఁబడుచున్నది. మహా విదేహవృత్తియందు చేయు సంయమమువలన క్లేశాదిమలములు నివర్తించును.

అవ. ఇదివఱకు వివిధసిద్ధులను బోధించి యిప్పుడు యోగికి స్వరూపదర్శనోపయోగమైన సబీజ నిర్బీజ సమాధిసిద్ధికొఱకు వివిధోపాయములను బోధింప నెంచినవారై, ప్రథమమున పంచభూత జయోపాయమును జెప్పుచున్నారు.—

### 45. స్థూల స్వరూప సూక్ష్మాన్వయార్థవత్వ సంయమా ద్భూతజయః.

తా. పృథివ్యాది పంచభూతముల యందును, వాని స్వరూపములయందును, గంధాది పంచతన్మాత్రలయందును, వాని క్రియలయందును, భోగాపవర్గరూపశక్తియందును; క్రమముగా సంయమము చేయుటవలన పంచభూతముల జయము కలుగును.

వి. పృథివ్యప్తేజోవాయురాకాశములను పంచభూతముల (స్థూలభూతముల) యందును, వీనియొక్క స్వరూపము లైన కఠినాదులయందును, గంధాదితన్మాత్ర లైన సూక్ష్మ తత్త్వములయందును, వీనియొక్క స్థితుల యందును, ఇంద్రియములయందును, వీనియొక్క కర్మములయందును, అంతఃకరణములయందును, వీనియొక్క ప్రకాశరూప మైన వృత్తులయందును, క్రమముగా సంయమము చేయుటవలన పంచభూతజయము గలుగును.

అవ. పంచభూతజయముయొక్క ఫలమును జెప్పుచున్నారు.—

46. తతోఽణిమాదిప్రాదుర్భావః కాయసంపద్ధర్మానభిఘాతశ్చ.

తా. ఆ భూతజయసిద్ధిచేత అణిమాద్యష్టసిద్ధులును, దేహసంపదయును, దేహరూపాదులు శాశ్వతముగా నుండుటయును సంభవించుచున్నది.

వి. పంచభూత జయమువలన అణిమాద్యష్టసిద్ధులును, రూపలావణ్యాది దేహసంపదయును, దేహదార్ఢ్యాదులును స్థిర మై యుండుటయును కలుగును (దేహసంపదనుగూర్చి క్రిందిసూత్రమున వివరింపఁబడును).

## అణిమాద్యష్టసిద్ధుల వివరణము.

(1) పరమాణువుకంటె సూక్ష్మ మగుట అణిమము.

(2) మహత్తుకంటె గొప్పగా అగుట మహిమము.

(3) భారమునకంటె భార మగుట గరిమము.

(4) దూదికణముకంటె తేలిక యగుట లఘిమము.

(5) సూర్యచంద్రాదులను సహా అనాయాసముగా తాఁకునట్టి శక్తి గల్గుట ప్రాప్తి.

(6) తాను తలఁచినరీతిగా అగుట ప్రాకామ్యము.

(7) మహిమ గలవాఁడుగా నగుట ఈశత్వము.

(8) చరాచరప్రపంచమంతయును తన ఆజ్ఞకు లోఁబడుట వశిత్వము.

అవ. పూర్వోక్త సూత్రమున జెప్పఁబడిన దేహసంపదను వివరించుచున్నారు..

47. రూప లావణ్య బలవజ్రసంహననత్వాని కాయసంపత్.

తా. రూపము, లావణ్యము, బలము, కఠినము, ఇవి శరీరసంపద యనఁబడును.

వి. మన్మథ వసంత జయంతాదులకంటె మించిన సౌందర్యమును, సూర్యచంద్రాగ్నులను మించినకాంతియును, బ్రహ్మ విష్ణు రుద్రాదులకంటె మించినశక్తియును, పర్వతపక్షములను ఛేదించినట్టి వజ్రమును మించిన కఠినత్వమును ఇవి శరీరసంపత్తనఁబడును.

అవ. ఇంద్రియజయమును జెప్పుచున్నారు.—

48. గ్రహణ స్వరూపాస్మితాన్వయార్థవత్త్వ సంయమాదిన్ద్రియజయః.

తా. ఇంద్రియ వృత్తులయందును, ఇంద్రియ ప్రకాశములయందును, అస్మితయందును, ఇంద్రియములయొక్క పాటవము కార్యము దార్ఢ్యము అగు వీనియందును, ఇంద్రియఫలమునందును, క్రమముగా సంయమము చేయుటవలన ఇంద్రియములు తన స్వాధీన మగును.

వి. విషయాభిముఖమైయుండు ఇంద్రియవృత్తులయందును, సామాన్యముగా ఇంద్రియగోచరముల (తెలిసికొనుట) యందును, అహంకారధర్మమైనట్టి నేను తెలిసికొన్నాను అనుటయందును, ఇంద్రియములపాటవము, పని, దృఢము అగు వీనియందును, సంయమము చేయుటవలన ఇంద్రియజయము కలుగును.

అవ. ఇంద్రియజయముయొక్క ఫలమును జెప్పుచున్నారు.—

49. తతో మనోజవిత్వం వికరణభావః ప్రధానజయశ్చ.

తా. ఇంద్రియజయమువలన మనుష్యునకు దేహములోని ఇంద్రియములు గమనాగమనాదులను, దేహముయొక్క బాహ్యేంద్రియప్రచారములను, మూలప్రకృతియొక్క స్వాధీనమును కలుగుచున్నది.

వి. ఇంద్రియస్వాధీనమువలన స్వేచ్ఛగా దేహమునందు ఇంద్రియములు సంచరించుటయును, దేహాపేక్షలేక బైటసంచారము, అనఁగా, కన్నులు మూసికొనియున్నను బైటి రూపములు కనఁబడుచుండుటయును, మూలకారణజయమును కలుగును. ఈ సిద్ధులు మధుప్రతీకము లనఁబడును. అనఁగా, తేనెపట్టుయందలి యే ప్రక్కనుండు తేనియను పుట్టినను ఎట్లు రుచికరమై యుండునో, అట్లు ఒక ఇంద్రియమును జయించినప్పటికిని ఆ యింద్రియాను గుణమైనసిద్ధి మహాసంతోషకరమైనదిగానే యుండును.

అవ. చిత్తముయొక్క సంయమమునను, దాని ఫలమును జెప్పుచున్నారు.

50. సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వం చ.

తా. చిత్తముయొక్క సాత్త్వికభాగమునందు సంయమము చేయుటచేత; బుద్ధియు, పురుషుఁడు, వేఱే అను జ్ఞానము కల్గును. ఈ జ్ఞానము కలవానికి సమస్తమైన ప్రకృతిపరిణామములకు తాను ఆధారభూతుఁడనియును వానియొక్క జ్ఞానము గలవాఁడనియును బోధ మగును.

వి. చిత్తసాత్త్విక పరిణామమునందు చేయు సంయమమువలన పురుషునియందును బుద్ధియందును అన్యథా జ్ఞానము కలుగును. అనఁగా బుద్ధియే పురుషుఁడు, లేక ఆత్మ అనెడు అజ్ఞానము తొలఁగును. మఱియు ప్రకృతిపరిణామములకు ఆధారభూతుఁడై యుండుటయును, సర్వజ్ఞాతృత్వ

మును కలుగుచున్నది. ఇట్టి జ్ఞానమునకు వశీకారమనియును, ఈసిద్ధికి విశోకా అనియును సంజ్ఞకలిగి యున్నది.

అవ. విశోకాసిద్ధిని చెప్పుచున్నారు.—

51. తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్.

తా. ఆ విశోకానామకసిద్ధియందు వైరాగ్యము కలుగుటవలన రాగాదిక్లేశములకు కారణమైన అవిద్య నాశమై ముక్తి కలుగును.

వి. విశోకాసిద్ధియందు వైరాగ్యముచేయుటచే క్లేశాదులకు బీజమైన అజ్ఞానము క్షీణమై, అందువలన నిరతిశయానందస్వరూపమైన కైవల్యము సిద్ధించుచున్నది.

అవ. యోగవిఘ్నములగువానిని పరిహరింపవలయునని వక్కాణించుచున్నారు.—

52. స్థాన్యుపనిమన్త్రణే సంగస్మయాకరణం పునరనిష్టప్రసంగాత్.

తా. దేవతలు భోజనముచేయుమని ప్రార్థించునపుడు, అభిలాషయు ఆశ్చర్యము నొందరాదు. అభిలషించినయెడల, మఱల దుఃఖరూపమైన సంసారముయొక్క సంబంధము కలుగును.

వి. ఆయాయా తత్త్వస్థానములకు అధిపతులైన తత్త్వాభిమానదేవతలు మొదలగువారు యోగియొక్క ఉత్కృష్టపదవికి సహింపనివారై విఘ్నము చేయ నెంచి, మాయొద్ద భోజనముచేసి మాకోరికను నెఱవేర్పవలసినదని స్వర్గాదిలోకాంతరములయందుండు దివ్యస్త్రీలను, రసాయనాది పదార్థములను యోగి ముందు తెచ్చిపెట్టి స్వీకరింపవలయు నని ప్రార్థింతురు. వీరి ప్రార్థనను అంగీకరించినచో, యోగి మఱల జననమరణప్రవాహరూపమైన ఘోరసంసారమునందు పడవలసివచ్చును; కాన వారి ప్రార్థనను అంగీకరింపఁ గూడదు.

యోగులు వారివారిస్థితులచే నాలుగుతరగతులవారుగ నున్నారు.

(1) యోగాభ్యాసి యైనవాఁడు ప్రవృత్తమాత్రజ్యోతిష్కుఁడు.

(2) ఋతంభరప్రజ్ఞావంతుఁడు.

(3) భూతేంద్రియజయశీలుఁడు.

(4) అతిక్రాంతభావనీయుఁడు.

నాలుగవతరగతివాఁడుమాత్రము సమాధిబలమువలన సప్తభూమికల ప్రజ్ఞ గలవాఁడై మధుమతి యనెడు పేరు గల భూమికను సాధించుచుండువాఁడు గాన, వీనినిమాత్రము ఆ దేవతలు ప్రార్థింతురు. ఈ యోగి ఆప్రార్థనము నంగీకరింపఁ దగదు.

అవ. సమాధిసిద్ధికై వేఱే యుపాయమును జెప్పుచున్నారు.—

53. క్షణతత్క్రమయోః సంయమాద్వివేకజం జ్ఞానమ్.

తా. క్షణకాలముయొక్క ముందటివెనుకటి క్షణములను సంయమము చేయుటవలన వివేకముచేఁ బుట్టిన జ్ఞానము కలుగును.

వి. కాలముయొక్క కడపటి అవయవమై, మఱి విభాగశూన్యమైనదై యుండుకాలము క్షణకాల మనఁబడును. ఈ క్షణమునకు ఇది ముందటి క్షణము, ఈ క్షణమునకును ఇది వెనుకటి క్షణము అనునట్టి క్షణములయందు సంయమము చేయుటవలన ఆ క్షణకాలములు గోచరించుచుండును. అప్పుడు ఇతరము లైన మహదాది పరమాణువులవఱకుఁ గల తత్త్వములు తెలియును. ఇట్లు తెలియుటయే వివేకజ్ఞానము.

అవ. యథార్థజ్ఞానసిద్ధికల్గుట కుపాయమును జెప్పుచున్నారు —

54. జాతిలక్షణదేశై రన్యతానవచ్ఛేదాత్తుల్యయో స్తతః ప్రతిపత్తిః.

తా. ప్రాణుల జాతులయందును, వాని ఆకారాది రూపవిశేషములయందును, వాని స్థానవిశేషములయందును, పరస్పరభేదము తెలియఁబడక

యుండునట్టి సమానవస్తువుల యందు సంయమము చేయుటవల్లన అవి వేర్వేఱను నిశ్చయజ్ఞానము కలుగును.

౫౩. జాతిచేతను, ఆకారముచేతను, స్థానముచేతను సహా పరస్పర భేదము విభజనగాక యుండునట్టి సమానవస్తువులయందు సంయమము చేయుటవలన, అవి వేర్వేఱు అనునట్టి జ్ఞానము కలుగును. అనగా, వస్తువులయందు పరస్పరభేదము తెలియుటకు జాతియు, లక్షణము, ప్రదేశము, ఇవి కారణములై యున్నవి.

ఎట్లనగా; ఇది ఆవు, ఇది యెనుము, అను రెండువస్తువుల భేదము తెలియుటకు జాతి కారణమై యున్నది. మఱియు ఇది నల్లనియావు, ఇది తెల్లనియావు అను రెండువస్తువులయందు భేదము తెలియుటకు జాతి కారణముగాక, నల్లన తెల్లన అనెడు లక్షణమాత్రమే కారణమై యున్నది. సమమైయుండు రెండు ఉసిరికఫలముల భేదము తెలియుటకు జాతియు లక్షణము సహా కారణమై యున్నది. ఆ రెంటియందు దీనికి అది ముందుగను దాని కిది ముందుగ నున్నదని వానిభేదము తెలియుటకు దేశము కారణమై యున్నది. దేనిచేతగాని జాతిలక్షణదేశములు మూడింటివలన భేదము తెలియుటకు అశక్యమై యుండు ఒకేజాతి, ఒకేలక్షణము, ఒకదేశమునం దుండునట్టి పృథ్వీపరమాణువుల భేదము అగు వీనిని తెలియుటకు వాని యొక్క సంయమము చేయువానికి, వానియొక్క భేద మెప్పుడు తెలియవచ్చునో, ఆక్షణమునందే అతిసూక్ష్మములైన సకలవిషయముల జ్ఞానమును కలుగుచున్నది. ఏలాగనగా, తనకు వరుసగనుండు స్థలమునందు ఒకే శ్రుతి చేసియుండు నాలుగు వీణెలనుంచి ఆ నాలుగువీణెలయందును, ఒకే స్వరమును ఒకేకాలమున వాయించినయెడల ఆస్వరము ఒకటిగానే వినంబడినను, ఆ ఒకేస్వరము నందుండు భేదములుమాత్రము కనబడు చుండును.

౫౪. తారకశబ్దార్థమును నిర్వచించుచున్నారు.

55. తారకం సర్వవిషయం సర్వథా విషయమక్రమం
చేతి వివేకజం జ్ఞానమ్.

తా. వివేకమువలనఁ బుట్టిన జ్ఞానమునకు తారక మని నామము. ఈ తారకజ్ఞానము మహదాది సమస్తతత్త్వములు విషయములుగాఁ గలది. మఱియు క్రమరహితమైనది. ఇది వివేకమువలనఁ బుట్టిన జ్ఞానము.

వి. ముందుఁ జెప్పఁబడిన వివేకజన్యజ్ఞానము తారకము (ఘోరసంసారమునుండి గట్టెక్కింపఁగలిగినది, లేక యథార్థమైనది) అనఁబడుచున్నది. తారకజ్ఞానమువలన పరమాణువు మొదలు మహాల ప్రకృతివఱకుఁ గల స్థూల సూక్ష్మాది నానావస్థాభేదములయందుండు సర్వమును సర్వతోముఖమై ఏకకాలమునందే గోచరించును.

అవ. తారకజ్ఞానప్రయోజనమైన కైవల్యమును నిరూపించుచున్నారు.

56 సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమ్.

తా. చిత్తముయొక్క సత్త్వమునకును పురుషునకును, నిర్మలత్వము ఏకకాలమునందు కలుగుటయే కైవల్యము.

వి. చిత్తమునందలి సత్త్వమునకు కర్తృత్వాద్యభిమానములు గల గుణములు లయమై, తన స్వకారణమైన స్వాత్మస్థుఁడైన పురుషునియందు ప్రవేశించుటయు, పురుషునియందు ఆరోపితమై యుండు భోగము నివృత్తి యగుటయు, ఇట్లు ఒకేస్థితి కలుగుటయే నిరతిశయానంద కైవల్య స్వరూపమైన మోక్షపదవి యనఁబడును.

పాతంజలయోగశాస్త్రమునందు

విభూతిపాదము

సమాప్తము.



ఓమ్.

పరాత్పరాయ నమః.

# పాతంజలయోగశాస్త్రము

## ౪. కైవల్యపాదము.



శ్లో. యత్పదాబ్జాంఘ్రిద్వయాసేవ దత్తే సిద్ధిం చ సర్వదా
కైవల్యానన్దపదవీం నౌమి తం పార్వతీపతిమ్.

అవ. పూర్వోక్తపాదములయందు జీవునకు కైవల్యస్వరూపము బోధమగుటకుఁ దగిన సాధనములను నిరూపించి, ఈ కైవల్యపాదమునందు సకలసిద్ధులకు సమాధియే కారణమనియును; ఈ సిద్ధులు పూర్వజన్మములందలివియైనను అభివ్యక్త మగునవియును: సమస్తమైన సమాధులయొక్క ఫలము కైవల్య మహాపదవి యనియును బోధించుచున్నారు.—

### 1. జన్మౌషధి మన్త్ర తపస్సమాధిజాః సిద్ధయః.

తా. జన్మములు, మూలికలు, మంత్రములు, తపస్సు, సమాధి, అను వీనివలనఁ బుట్టునట్టి సమాధిసిద్ధులైదువిధములు గలవిగా నున్నవి.

వి. సమాధిసిద్ధులు నానావిధములైన జన్మములవలనను, మూలికలను సేవించుటవలనను, మంత్రములను జపించుటవలనను, తపస్సు చేయుటవలనను, సమాధులను అభ్యసించుటవలనను గల్గును. ఎట్లనఁగా:—

జన్మాదులను నిమిత్తముచేసికొని ఆకాశమున సంచరించుట, జలము నందుండుట, జీవచర్యలులేక దేహమునుంచికొనియుండుట, బహుకాలము

జీవించుట, మనస్సునకు తోఁచినట్లెల్ల ఆకారములను ధరించుట, పరకాయ ప్రవేశము చేయుట, ఈ మొదలగునవి సమాధివలనఁ గల్గిన సిద్ధులు.

పూర్వ జన్మములయందు గలిగిన సమాధిబలమువలన పక్షులు, జలచరములు, సర్పములు, పిశాచప్రారబ్ధములు, ఈ విధమైన యొక్కొక్క ప్రాణులను నిమిత్తము చేసికొనియుండుట జన్మమువలనఁ గలిగిన సిద్ధులు.

నిద్రాహారములు లేక యుండుట, శీతోష్ణవిషవ్యాధుల నిగ్రహము, ఇంద్రియపటుత్వము, శరీరదార్ఢ్యము, జరామరణాదుల నిరోధము, దూరగమనాగమనములు మొదలగు సిద్ధులు, లేహ్య చూర్ణ కాయకల్ప సిద్ధరసాయన ఘుటికా పాదుకలు, ఇవి మొదలగు సిద్ధులు మూలికలవలనఁ గల్గిన సిద్ధులు.

ఆయా మంత్రాధిష్ఠానదేవతల శక్త్యనుగుణముగా కలుగునట్టిది మంత్రములవలనఁ గలిగిన సిద్ధులు.

వానివాని తపోబలము ననుసరించి గల్గు సిద్ధులు తపమువలనఁ గలుగు సిద్ధులు.

మఱియు సమాధివలనఁ గలుగు సిద్ధులనుగూర్చి 12-3 పాదముల యందు విస్తరముగా జెప్పఁబడి యున్నది.

ఈ సిద్ధులు పూర్వ జన్మముయొక్క సమాధిబలమువలనఁ గలుగునవి యని నిరూపింపఁబడినది. మఱియు సమాధి యనునది సిద్ధులకు ముఖ్యకారణమైన దనియును, జన్మాదులు నిమిత్తకారణమైన దనియును చెప్పినందువలన, సమాధికి అధికప్రాశస్త్యము కలిగెను.

అవ. ఒక్క జన్మమునందే సమాధిఫలమును బొందవచ్చు నని చెప్పుచున్నారు.—

## 2. జాత్యన్తరపరిణామః ప్రకృత్యా పూర్వాత్.

తా. ఒక్క జన్మమునందే వేఱుజాతిగా పరిణమించుట యనునది ప్రకృతి పరిణామ సమాప్తివలనఁ గలిగినది.

వి. ప్రకృతి యనఁగా, ప్రధానము మొదలు పృథివివఱకు నుండు పదార్థములు.

ఈ పదార్థములయంశము సర్వ దేహములయందు నుండుటవలన, ప్రతిక్షణమునందును పరిణమించుచుండును.

ఇందువలన ఒకేజన్మమునందే పూర్వజాతి పరిణామము పూర్తియై వేఱేజాతిపరిణామము కలుగును.

దృష్టాంతము:—నందీశ్వరునకు ఆ జన్మమునందే పూర్వజాతి పరిణామము సమాప్తమై, వేఱేజాతి పరిణామము కలిగినందువలనను, జన్మాంతరాభ్యస్తమైన సమాధిఫలము అభివ్యక్తము కాఁగా, ఆ మొదటిజాతి అనర్హమైనదై పోయినందు వలనను, ఆ రెండవజాతి దేహమునందు ఫలము అభివ్యక్తమైనది. ఎట్లనఁగా, పట్టుపురుగు మొదట కంబళిపురుగుగా నుండి ఆ పరిణామము తీరఁగానే ఆ దేహమునందే సంజీవిపురుగువలె పరిణమించుచున్నది. కాఁబట్టి ప్రకృతియొక్క పరిణామము పూర్తియగుటయే వేఱేజాతి జన్మమునకు కారణ మని యెఱుఁగునది.

ఇక. సకల జన్మములకును ప్రకృతియే కారణ మని వక్కాణించుచున్నారు.—

3. నిమిత్త మప్రయోజకం ప్రకృతీనాం వరణభేదస్తు తతః క్షేత్రికవత్.

తా. కర్మము ప్రకృతి భాగములయొక్క కార్యమైన జాత్యంతర పరిణామమునకు కారణమైనది కాదు. ఆ కర్మమువలన వ్యవసాయము చేయువాఁడు అడ్డముగానుండు వానిని తీసి పాఱవైచినట్లు ఆ ప్రకృతియొక్క ఆవరణము నివృత్తి యగుచున్నది.

వి. ప్రకృతిచేఁ గలుగునట్టి జాత్యంతర పరిణామమునకు కర్మము కారణ మగుట లేదు. ఏలనఁగా, కారణముచేఁ గార్యము కలుగుటయే

కాని, కార్యమునకే గారణము కలుగుటలేదు. గాన, ఈ పుణ్యపాప రూపమైన కర్మము ప్రకృతియొక్క కార్యమై యుండుటవలన, ఇది తనకుఁ గారణమైన **ప్రకృతియొక్క స్వభావరూప పరిణామమైన జన్మములకు గారణమగుటలేదు.** అయినను, పుణ్యపాప రూపమైన యీ కర్మము ప్రకృతియొక్క పరిణామముచేఁ గలుగు జన్మములకు ప్రతిబంధకముగాని, బలవంతముగాని చేయునదిగా నున్నది. ఎట్లనఁగా, కృషిచేయువాఁడు ఒక మడినుండి మఱియొక మడికి నీళ్లు పాఱించునపుడు మధ్య నడ్డమై యుండు మట్టిని తీసివైచినప్పుడు, ఆ మడియందుండు జలము మఱియొక మడికి కృషకుని ప్రేరేపణలేకయే స్వభావముగాఁ బ్రవేశించి చౌకము, త్రికోణము మొదలగు ఆకారములు గల ఆ మడి వలెనే యెట్లు పరిణమించునో, అట్లే పుణ్యపాపములు అనుభవించిగాని, తమను నిరోధమైన కర్మము చేయుటవలనఁ గాని సమాప్తియై పోఁగా, ప్రకృతియొక్క పరిణామమునకుఁ గల ప్రతిబంధకము తప్పిపోయి, తన స్వభావమువలెనే పరిణమించును. కాఁబట్టి ప్రకృతియొక్క పరిణామక్రమమునందు నే అనేక జాతి జన్మములు కలవు. కర్మముచేత యీ జన్మములయందు దేనినైనఁ గాని సంపాదించుకొనవచ్చును. లేక పోఁగొట్టుకొనవచ్చును.

అవ. తత్త్వసాక్షాత్కారముగల యోగి స్వేచ్ఛానుసారముగా ననేక శరీరములను నిర్మించుకొనఁ గలఁడని చెప్పుచున్నారు.—

4. నిర్మాణచిత్తాన్యస్మితామాత్రాత్.

తా. యోగి నిర్మించునట్టి దేహములయందుఁ గల చిత్తములు కలుగ వలయునని తలఁచిన మాత్రముచేతనే నానాదేహములును చిత్తములును కలుగుచున్నవి.

వి. కర్మలేశములేని యోగి (తత్త్వసాక్షాత్కారము గల యోగి) కర్మఫలములైన సుఖాదుల ననుభవించుట కిచ్ఛగించినంతనే, అగ్నివలన నేలాగున నిమిషమాత్రమునందు అనేకములైన కణములు కలుగుచున్నవో, అట్లే అనేకములైన దేహాకారములై పరిణమించును.

అవ. యోగి శరీరములు వేరైనను అతని చిత్తముమాత్రము యేకరీతి గానే యుండునని చెప్పుచున్నారు.—

5. ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్తమేక మనేకేషామ్.

తా. బహువిధములైన చిత్తప్రవృత్తులయొక్క భేదమునందు (కూడ) యోగియొక్క స్వకీయచిత్తము ఒకటే కారణమై యున్నది.

వి. ఆ అనేక చిత్తములయొక్క ప్రవృత్తినివృత్తులు భేదము గలవిగా నగపడినను, యోగియొక్క స్వయమైన చిత్తముమాత్రము ఒకే కారణమైనదిగా నుండును. ఎట్లనగా, ఒక దేహమునందుండు చిత్తము యింద్రియాదులను తన యిచ్ఛానుసారముగా నెట్లు ప్రేరేపించునో అట్లే యని భావము.

అవ. యోగియొక్క ప్రకృతిజన్మచిత్తమే శ్రేష్ఠ మైనదని బోధించుచున్నారు.—

6. తత్ర ధ్యానజ మనాశయమ్.

తా. ఆ యనేకచిత్తము లన్నిటికంటె, ఇప్పటి సమాధిచేఁ గలిగిన చిత్తము కర్మవాసనా రహితమైనది.

వి. ఇదివఱకుఁ జెప్పఁబడిన జన్మాది కారణములచేఁ గలిగిన అయిదు విధములైన చిత్తములకంటెను, ఇప్పటి సమాధిచే ననేకచిత్తములై పరిణమించు శక్తి గల చిత్తము కర్మవాసనారహిత మైనదై విలక్షణ మైనదై యుండును.

అవ. ఇతరు లాచరించు కర్మముకంటెను యోగులయొక్క కర్మము వుత్తమ మైనదని చెప్పుచున్నారు.—

7. కర్మా శుక్ల కృష్ణం యోగిన స్త్రివిద మితరేషామ్.

తా. యోగులకంటెను ఇతరులైన వారియొక్క కర్మము శుభ్రమైనదనియును, నీలమైన దనియును, మిశ్రమైన దనియును మూఁడు విధములు గలదిగా నున్నది.

వి. యోగులకంటెను ఇతరులయొక్క కర్మము పుణ్య పాప మిశ్రరూప మైన సుఖదుఃఖ మిశ్రఫలముల నిచ్చునట్టిదిగా నున్నది. శుభఫలముల నొసంగఁదగిన యాగాది సత్కర్మములు శుక్లకర్మము లనియును, అశుభఫలముల నొసంగఁదగిన బ్రహ్మహత్యాది దుష్కర్మములు కృష్ణకర్మములనియును, మిశ్రఫలముల నొసంగఁదగిన వాపీకూపతటాకారామ నిర్మాణాది మిశ్రకర్మములు సుఖదుఃఖఫలముల నొసంగు మిశ్రకర్మము లనియును, కర్మము మూఁడు విధములు గలది. కర్మవాసనా రహితులైన యోగులు ఏ కర్మము జేసినను అది సంచితమై నిలువక జ్ఞానాగ్నిచే దహింపఁబడుచున్నది గాన యోగియొక్క కర్మము విలక్షణ మైనదిగా నున్నది.

అవ. పుణ్యపాప మిశ్రకర్మముల సంస్కారఫలమును నిరూపించుచున్నారు —

౮. తతస్త ద్విపాకానుగుణానామే వాభివ్యక్తి ర్వాస నానామ్.

తా. ఆ కర్మమువలన, ఆయా జాతిదేహముల పరిపాకములకు అనుకూలించు నట్టివిగా నుండు సంస్కారములయొక్క ఆవిర్భావము కలుగుచున్నది.

వి. కర్మ సంస్కారఫలములు స్మృతిమాత్ర సంస్కారఫలము లనియును, జాత్యాయుర్భోగఫలము లనియును రెండువిధములు.

స్మృతిమాత్ర సంస్కారఫలము లనఁగా:—చేయుటవలనను, అనుభవించుటవలనను, తెలిసికొనుటవలనను కలుగు సంస్కారము చిత్తమునం దుండి తగిన కారణముల మూలకముగా జ్ఞాపకమునకు వచ్చునట్టివిగా నున్నవి. ఎట్లనఁగా, మొదట దేవతాదేహము వచ్చినప్పుడు కలిగిన సంస్కారములన్నియు చిత్తమునం దుండి, మఱల దేవతాదేహము వచ్చినప్పుడు తప్పక అభివ్యక్త మగుచున్నది. ఆ దేవతాదేహములు రెంటిమధ్య, కలిగిన యితరదేహ

ములయందు అభివ్యక్త మగుటలేదు, ఈ ప్రకారముగా, మొదటి మనుష్య దేహమునందు గలిగిన సంస్కారములు మఱల మనుష్యదేహము వచ్చినప్పుడు అభివ్యక్త మగుచున్నది. ఆ మనుష్యదేహములు రెంటివడుమ కలిగిన యితర గజాశ్వ శ్వాన సూకరాది దేహములయందు ఆ మనుష్యదేహమునందు కల్గిన సంస్కారములు అభివ్యక్త మగుట లేదు. ఇట్లు ముందు ఏజాతిదేహము వీని యందు గలిగినను ఆవాసన మఱల అట్టి దేహము వచ్చినప్పుడు మాత్రమే అభివ్యక్త మగును. ఇతర దేహములు కలిగినప్పుడు ఆ సంస్కారములు అభివ్యక్తము గాక చిత్తమునందు ఆచ్ఛాదితమై నిలిచియుండునే గాని అభివ్యక్తము కాదు. (జాత్యాయుర్భోగములను గూర్చి 2-వ పాదము 13-వ సూత్రమును చూడుడు.)

అవ. ప్రాణులయొక్క జన్మాదివాసనలు చిత్తమునందుండి సమాన దేహములయందే అభివ్యక్తమగు ననుటను దృఢపఱచుచున్నారు.—

## 9. జాతి దేశ కాల వ్యవహితానా మప్యానన్తర్యం స్మృతి సంస్కారయో రేకరూపత్వాత్.

జ్ఞాపకము, వాసన, ఇవి రెండు నొకేరీతిగా నుండుటవలన మనుష్యత్వ పశుత్వాదిజాతులు, కాశీరామేశ్వరాది దేశములు, జయవిజయాది సంవత్సర కాలములు, వీనివలన నొకటి కొకటి దూరదూరముగా నున్నను, ఆ స్మృతి సంస్కారములు ఒకటినుంటి మఱొకటి క్రమముగా నుండునట్టివిగా నున్నవి.

వి. జాతి దేశ కాలములవలన, ఒక జన్మమునకు మఱియొక జన్మము దూరదూరముగా నున్నను, అనగా మనుష్యజన్మమునుండి మఱల మనుష్య జన్మమువచ్చుటకు విలంబమైనను, ఆ మొదటి దేహమునుండి ఈ రెండవ దేహము క్రమముగా అతిసమీపమునం దుండునది యని యున్నవలసినదిగా నున్నది. కాబట్టి, ఆ మొదటి దేహముయొక్క స్మృతి సంస్కారములు ఈ

రెండవదేహమునందు అభివ్యక్త మగుచున్నవే కాని, ఈ రెండవదేహము వచ్చుటకు అతిసమీపమునందలి వేఱే దేహముయొక్క స్మృతి సంస్కారములు కలుగుటలేదు. అనఁగా, సమానజాతి దేహముయొక్క స్మృతి సంస్కారముల కైకమత్యము కలుగునేగాని, భిన్నజాతి దేహములయొక్క స్మృతి సంస్కారములకు కార్యకారణభావము సంబంధించుటలేదు.

ఎట్లనఁగా:—పుణ్యముచే మొదట నొకనికి దేవతాదేహము కల్గియుండెను. ఆ పుణ్యము ముగిసిపోయినంతట వాని సంచిత కర్మానుగుణముగా వేర్వేరైన పశు పక్షి క్రిమి కీటకాద్యనేక దేహములు వచ్చెను. ఆ జన్మములు తీరగానే పుణ్యఫలమైన దేవతాదేహము మఱల వచ్చెను. రెండవ దేహము వచ్చినప్పుడు ఆ మొదటి దేవతాదేహమునందు సంపాదించిన స్మృతి సంస్కారములు అభివ్యక్త మగునేగాని ఈ రెండు దేవతాదేహముల నడుమ కలిగి తీరిపోయినట్టి పశుపక్ష్యాది దేహములయందు అవి అభివ్యక్త మగుట లేదు. ఈ పశుపక్ష్యాది దేహములు కలిగినప్పుడు ఆ దేవతా దేహముయొక్క స్మృతి సంస్కారములు అభివ్యక్తములుగాక చిత్తమునందు బీజరూపమై నిలిచి యున్నవి. ఆ దేవతాజన్మమునకు యీ రెండవదేవతా జన్మము సమానజాతియైన కారణమును బట్టి అతిసమీపమైనదని అనిపించుకొనుచున్నది. ఇట్లు సమానజాతిదేహములు కలిగినప్పుడు మాత్రమే ఆయా దేహముల స్మృతి సంస్కారములు కలుగుచున్నవి.

అవ. స్మృతి సంస్కారములు సమాన దేహములయందే అభివ్యక్తమగునని చెప్పి, యిపుడు ఆ స్మృతి సంస్కారములు అనాది యని నిరూపించుచున్నారు.—

## 10. తాసా మనాదిత్వ మాశిషో నిత్యత్వాత్.

తా. సదా సుఖసాధనములెల్ల నాకు కలుగనిమ్ము, ఎప్పుడును తప్పిపోఁగూడదు అనెడి చిత్తమునందలి మహా మోహరూపమైన సంకల్పమునకు

పుట్టి లేదు గాన, ఆ స్మృతి సంస్కారములును ఆది లేదు. అనఁగా క్రొత్తగా పుట్టుట లేదు.

వి. సుఖసాధనములు నాకే కలుగనిమ్ము, అది నన్ను వదలిపోఁగూడ దనెడు మహా మోహరూపమైన అవిద్యాసంకల్పము అనాదిగా నుండుట వలన, మొదటిజన్మమే కారణ మని యొప్పుటకు గాదు గనుక, మొదటిజన్మ మనునదే లేదు. ఎట్లనగాఁ, శిశువు పుట్టినంతనే కంపనము, దుఃఖము, మరణభీతి, స్తన్యపానము, మలమూత్ర విసర్జనాదులు, ఇవి మొదలగు వాని యొక్క స్మృతి సంస్కారములు క్లృప్తమై కలుగుచున్నవి. ఇవి అనాదిగా లేనియెడల, ఆ శిశువు అదే జన్మమునందే మరణాదులను మొదట నొకతూరి యనుభవించునది మఱల జ్ఞాపకమునకు తెచ్చుకొన వలసినదిగా నున్నది; అట్లు లేదు గాన ఆ స్మృతి సంస్కారములకు ఆది లేదు.

అవ. స్మృతి సంస్కారములను పరిహరించుకొనుటకు వుపాయమును జెప్పుచున్నారు.—

11. హేతుఫ లాశ్ర యాలమ్బనై స్సంగృహీతత్వా
దేషా మభావే తదభావః.

తా. స్మృతి సంస్కారములకుఁ గారణమైన అవిద్యాదులు, శరీర స్మృత్యాదులు, చిత్తము, అగు వీనియొక్క అవలంబనములచేత సంగ్ర హించుకొని యుండుటవలన, ఈ అవిద్యాదులు లేకపోయినప్పుడు ఆ స్మృతి సంస్కారములు నాశమగుచున్నది.

వి. స్మృతి సంస్కారములకు హేతువులైన అవిద్యాదులు, దేహము, చిత్తము, ఇవి యోగజ్ఞానముచే లయించిపోయినచో స్మృతి సంస్కార ములు నిర్మూలమై పోవును.

అవ. చిత్తవాసనల కార్యకారణములు నశించుటవలన స్మృతి సంస్కా రములు నివర్తి యగునని చెప్పుచున్నారు.—

12. అతీతానాగతం స్వరూపతో౽స్త్యధ్వభేదా ద్ధర్మా ణామ్.

తా. చిత్తధర్మములైన స్మృతి సంస్కారాదులకు మార్గభేదముల వలన గతించిపోవుటయు, ముందు రాఁబోవుటయు స్వభావముగనే కలిగి యున్నది.

వి. చిత్తమునందలి సంస్కారాది ధర్మములకు అనేక మార్గములయొక్క భేదములవలన నెంతకాలము గతించిపోయి యున్నప్పటికిని, మఱలను అది వచ్చుట స్వాభావికమై యుండుటం బట్టి స్మృతి సంస్కారములకు ఐకమత్యము కూడియే యున్నది. మార్పుచేత నూతనముగా స్మృతి సంస్కారములు కలుగుచున్నవికదా యనఁగా, ఏదియు మూలములేక అభావపదార్థములవలన సత్తయిన భావపదార్థములు కలుగుటకు కారణమే లేదు. అభావపదార్థములకు భావపదార్థముల సంబంధము కూడుటయులేదు. కాన, భావపదార్థములకు నాశమును అభావపదార్థములకు వుత్పత్తియును యెన్నఁడును కలుగుట లేదు. క్షిప్తముగాను, క్రమముగాను, కలుగుచుండునట్టి ధర్మములచేత నానావిధములుగా పరిణమించు ధర్మి, సదా ఒక్కవిధముగానే యుండును. ధర్మములుమాత్రము తమతమ మార్గములయందు క్రమప్రకారము గతించిపోవుటయు, భోగ్యయోగ్యములై యుండుటయు, ముందు రాఁబోవుటయు, ఇట్లు ధర్మములకు అతీతానాగతాది మార్గభేదములున్నను, మఱల మఱల ఆ ధర్మస్వరూపములచేతనే స్మృతి సంస్కారాదులకు (కార్యకారణభావము) ఐకమత్యము కూడుచుండును. ధర్మియైన చిత్తము మోక్షము వఱకును సదా ఏకరూపముగానే (ఒకేవిధముగానే) యుండుటవలన, ఈ నిజసిద్ధాంతమును అపలాపించి (మోసపుచ్చి) వేఱువిధముగాని జెప్పుటకు గాదు.

అవ. ధర్మధర్మిస్వరూపమును బోధించుచున్నారు.—

13. తే వ్యక్తసూక్ష్మా గుణాత్మానః.

తా. సత్త్వాదిగుణముల యొక్క స్వరూపములైనట్టి ఆ ధర్మి ధర్మములు స్థూలములుగను సూక్ష్మములుగను ఉన్నవి.

వి. ధర్మిధర్మములు రెండును, సత్త్వాదిగుణ పరిణామముచే స్థూలములుగను, సూక్ష్మములుగను నున్నవి. ప్రకృతిసంబంధమైన సకల వస్తువులును బాహ్యాభ్యంతరభేదముచే వేర్వేఱుగా స్థూలసూక్ష్మములనుబట్టి వెలియుచున్నప్పటికిని, భావవస్తువులకుమాత్రము పరస్పరముగా కార్య కారణభావము కూడుచున్నది. అనగా, ఏ వస్తువు ఏ ఆకారమును బొంది యున్నదో, ఆ వస్తువు ఆయాకారమై పరిణమించియున్నది. ఎట్లనగా, ఘటము, మృత్తిక అను వస్తువుచేఁ గూడియుండుటవలన ఆ ఘటము మృత్తికయొక్క పరిణామ రూపమై యున్నది.

అవ. త్రిగుణములు వేర్వేఱైనను ధర్మిమాత్రము ఒక్కటేయని చెప్పుచున్నారు.—

## 14. పరిణామైకత్వా ద్వస్తుతత్త్వమ్.

తా. త్రిగుణములు పరిణామముయొక్క ఐక్యమువలన భిన్నభిన్నరూపములై పరిణమించియుండు పదార్థమునకు ఏకత్వము (ఒక్కటే యను వ్యవహారము) కలిగి యున్నది.

వి. గుణపరిణామముచే పదార్థము వేర్వేఱు రూపములను బొంది యున్నప్పటికిని, ఆ గుణములు పరిణామముయొక్క ఐక్యమువలన ఆ పదార్థము ఒక్కటే యను వ్యవహారము కలిగియున్నది.

ఏలాగనగా :—గుణముల పరిణామమునందు కొన్నిచోట్ల సత్త్వగుణము దేహియై యుండినచో (శరీరముకలదియై యున్నచో) మిగిలిన రాజస తామసగుణములు దేహమై (అంగమై) యుండును. కొన్నిచోట్ల రాజసము దేహియై యున్నచో, మిగిలిన సత్త్వతమోగుణములు దేహమై యుండును. కాఁబట్టి గుణముల పరిణామమువలన వేర్వేఱుగా నుండు ప్రతిపదార్థము

నందును ఈ త్రిగుణములు యొకఁబాటుక యున్నవి గాన, ఆ పదార్థము ఒక్కటే యని వ్యవహరింపఁబడెను.

ఎట్లనఁగాః—పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మొదలగు వస్తువులయందు అంగాంగిభావసంబంధము (దేహదేహిభావసంబంధము) వలన ప్రతిపదార్థమునందును త్రిగుణము లున్నను, ఆ పదార్థములు ఒక్కటే పదార్థ మని వ్యవహారము సిద్ధించి యున్నది.

అవ. ధర్మియొక్క వివిధ భేదములకు కారణమును నిరూపించుచున్నారు.

15. వస్తుసామ్యే చిత్తభేదాత్తయోర్విభక్తః పన్థాః.

తా. విజ్ఞానార్థములకు పదార్థములయొక్క సమత్వమునందు చిత్తముల భేదదశవలన, అనేకము లైన మార్గములు కలిగి యున్నది.

వి. ప్రకృతికార్య మైనపదార్థములును, చిత్తమును (విజ్ఞానమును) సహా ఒక్కటే యైనప్పటికిని, లోకమునందు వాసనాబలముచేత ననేక చిత్తము లుండుటవలన, వస్తువులకును, చిత్తములకును అనేకము లైన మార్గములు కలిగియున్నవి. కాఁబట్టి విజ్ఞానవ్యతిరిక్త మైన పదార్థము లున్నవి.

ఉదాహరణముః—ఒకేవస్తు వైన స్త్రీ యొక పురుషునకు దొరికిన యెడల ఆస్త్రీ ఆ పురుషునకు సుఖకరముగాను, అదేస్త్రీ సవతికి దుఃఖకరముగాను, సన్న్యాసికి నిందితురాలుగాను వుండును. కావున ఆ స్త్రీ ఒకేవస్తు వైనను పరుల చిత్తములయొక్క వాసనాభేదములచేత ననేక విధములుగా గానఁబడుచుండును. విజ్ఞానవ్యతిరిక్త మైన వస్తువులు లేకపోయిన యెడల, ఒకేవస్తువు ఒక చిత్తమునకు సుఖమును, వేఱొకచిత్తమునకు దుఃఖమును, మఱొకచిత్తమునకు అసహ్యమును కలుగఁజేయుటకు కారణము లేదు. కాన విజ్ఞానవ్యతిరిక్తమైన వస్తువు లున్నవియని గోచరించుచున్నవి మఱియు నందఱియొక్క చిత్తములు నేకరీతిగా నున్నవి యని చెప్పినప్పుడు, ఒకని

చిత్తము ఒకకార్యమునం దాసక్తి వహించి యున్నప్పుడు, అందఱియొక్క చిత్తములును అదేకార్యమునందు ఆసక్తి వహించి యుండవలసి యున్నది. అట్లు లేదు గావున, విజ్ఞానవ్యతిరిక్తమైన వస్తువు లుండవలసియున్నవి, ఒక సమయమున ఒకేచిత్తము ఏకకాలమునందు భిన్నభిన్నములైన అనేక కార్యములను చేయుట (అనఁగా ఆ కార్యములకు భేదము) లేకపోవలసి యున్నది. అట్లు భేదము లేకపోవుటలేదు గాన విజ్ఞానవ్యతిరిక్తమైన వస్తువు లుండవలసియున్నవి. మఱియు విజ్ఞానమునకు వ్యతిరిక్తమైన కార్యమే లేదని చెప్పినప్పుడు (కారణభేదముచే కార్యభేదము లేదని చెప్పినప్పుడు) కారణము లేకయే విజ్ఞానవ్యతిరిక్తమైన ఈ జగత్తు కలుగవలసి యున్నది. అట్లు లేదు గాన విజ్ఞానమును, వస్తువులును వేర్వేఱని తోఁచుచున్నది. మఱియు కారణములు (చిత్తములు) భిన్నభిన్నములై యున్నప్పటికిని వానిచేఁ గలిగిన కార్యమునకు భిన్నభిన్నరూపములు లేవని చెప్పినచో, అప్పుడు జగమెల్లను అనేక వస్తువులుగా తోఁపక ఒకేవస్తువుగా కనఁబడవలసి యుండుటంబట్టి, విజ్ఞాన వస్తువులు వేఱని సిద్ధమగుచున్నవి. నానావిధములై యుండుట, ఈ ప్రపంచముయొక్క స్వభావ మనినచో, అప్పుడు, ఈ జగత్తు స్వతంత్ర మైనది యగును గాన కారణము లేకయే కలుగవలసివచ్చును. అయినను, త్రిగుణాత్మక మైన పదార్థములచే ఒక్కఁడైన పురుషునకు అనేక జ్ఞానము లెట్లు కలుగుచున్నదనఁగా:—వస్తువెట్లు త్రిగుణాత్మక మైనదో, అట్లే చిత్తమును త్రిగుణాత్మకమైయున్నది ఈ చిత్తమునకు భిన్నభిన్నార్థములు కనఁబడుటకు పుణ్యపాపములు సహకారికారణములై యున్నవి కాఁబట్టి ఆ పుణ్యపాపముల వ్యత్యాసములవలన, (హెచ్చుతక్కువలవలన) వస్తువులు ఆయా రూపమై ఒకచిత్తమునకు అనేకజ్ఞానములు కలుగుచున్నవి. ఎట్లు లనఁగా, ఒక పురుషునకు ఒకేవస్తువైన స్త్రీ వినయసద్వచనములచేత సంతోషమును కలుగఁజేయునదిగాను, కలహకఠోరవచనములచేత దుఃఖమును గలుగఁజేయునదిగాను, దూరమునం దుండుటచేత మోహమును గలుగఁజేయునది

గాను, ఇట్లు ఒకే చిత్తమునకు ఒకే వస్తువిషయకమైన అనేక జ్ఞానములు కలుగుచున్నవి గాన, విజ్ఞానవ్యతిరిక్తమైన వస్తువులు కలవని సిద్ధాంతితమై యున్నది. ఇప్పుడు విజ్ఞానమునకును అర్థమునకును తాదాత్మ్యమును చెప్పెడు పక్షమునందు కార్యకారణభావము ఘటించుట లేదు. మఱియు భిన్నభిన్నకారణము లున్నప్పటికిని, కార్యమునకు అభేదమును చెప్పినయెడల అతిప్రసంగమగును. కావున, విజ్ఞానవ్యతిరిక్తమైన వస్తువులు కలవని స్థాపింపఁబడినది.

అవ. ఇంద్రియములద్వారా చిత్తమునకు వస్తువులు గోచరించుటను గూర్చి వివరించుచున్నారు.—

16. తదుపరాగాపేక్షిత్వాచ్చిత్తస్య వస్తు జ్ఞాతాజ్ఞాతమ్.

తా. ఆ వస్తువులయొక్క రూపములను కనఁబఱచుటను (ప్రతిబింబించుటను) అపేక్షించుటవలన, చిత్తమునకు వస్తువు తెలియఁబడినదియు, తెలియఁబడక యుండునదియు నయితము కలదు.

వి. వస్తువులు తమతమ రూపములను ఇంద్రియములద్వారా జ్ఞానమునకు కనఁబఱచుటవలన, చిత్తమునకు వస్తువులు గోచరమునకు వచ్చె నని వ్యవహారమును, అట్లు కనఁబడకయుండుటకు గనఁబడలేదని వ్యవహారమును కలిగియున్నది. అనఁగా, ఏ పదార్థమునకును జ్ఞానమునకును సాక్షాత్సంబంధము కల్గియున్నదో, దానిని జూచితి నని వ్యవహారమును; అట్లు లేని దానిని చూడలేదని వ్యవహారమును కల్గియున్నది. కాఁబట్టి, సర్వదా సమస్తమును గోచరమునకు వచ్చుటకు గానేరదు. మఱియును అనుభవింపఁ బడియుండు విషయములకు సమానమైన విషయములయొక్క గోచరమువలన చిత్తమునందుండు సంస్కారము ఉద్బోధన వహించి దానిచేత ఆ విషయకమైన స్మృతి కల్గుచున్నదే కాని, ఉద్బోధకసామగ్రిలేక సర్వదా స్మృతి కలుగనేరదు. కావున ఏకకాలమునందే వస్తుగోచరమును స్మృతియును కలుగఁగూడదనిదిగా నున్నది.

అవ. చిన్మాత్రుఁ డగు పురుషుఁడు గ్రహీతృ వనియును, పరిణామ మును బొందనివాఁ డనియును జెప్పుచున్నారు.—

17. సదా జ్ఞాతా శ్చిత్తవృత్తయ స్తత్ప్రభోః పురుషస్యా పరిణామాత్.

తా. ఆ చిత్తముయొక్క అధిపతియైన చిన్మాత్రుఁ డగు పురుషునకు పరిణామము లేకుండుటవలన చిత్తముయొక్క వృత్తులు నిరంతరమును తెలియఁ బడినవిగా నున్నవి.

వి. చిత్తమునకు ప్రభువైన పురుషునకు పరిణామాద్యవస్థలు లేకుండుట వలన ఆ చిత్తవృత్తులను సదా చూచుచున్నాఁడు, పురుషుఁడు పరిణామము కలవాఁడైనయెడల చిత్తవృత్తులు తెలియకపోవలసి వచ్చును.

అయినను పురుషుఁడు చిత్తమునకు ఆధారభూతుఁడై యుండుటంబట్టి చిత్తము యే విషయములయొక్క వస్తువులయందు చేరుచున్నదో, ఆయా విషయములయొక్క వస్తువులనంతయును పురుషుఁడు చూచుచునే యున్నాఁడు గాన పురుషునకు పరిణామాధి ధర్మములు లేవు.

అవ. చిన్మాత్రుఁడైన పురుషునియొక్క ప్రయోజనమును జెప్పు చున్నారు.—

18. నత త్స్వాభాసం దృశ్యత్వాత్.

తా. ఆ చిత్తము పురుషునకు దృశ్యమై యుండుటవలన స్వప్రకాశక మైనది.

వి. చిత్తము చిన్మాత్రుఁడైన పురుషునకు కనఁబడునట్టి పదార్థమై యుండుటంబట్టి, కనబడునట్టి ఘటపటాదులవలె స్వప్రకాశక మైనదికాదు. అనఁగా తనను ప్రకాశపఱచుకొనునట్టిది కాదు. ఇట్లనుటచే స్వయంప్రకాశక మైన దని తెలియఁదగినది.

అవ. చిత్తముయొక్క స్వభావస్థితిని వివరించుచున్నారు.

19. ఏకసమయే చోభయానవధారణమ్.

తా. ఏకకాలమునందే స్వరూపమును వస్తువును సహా గ్రహించుటకు సాధ్యము కాదు.

వి. ఒకేసమయమున తన స్వరూపమును ఇతరవస్తువులను సహా గ్రహించుశక్తి చిత్తమునకు లేదు గాన, చిత్తము స్వప్రకాశమైనది కాదు. మఱియు నేను సుఖిని, నేను దుఃఖిని, అను విరుద్ధమైన ద్వివిధజ్ఞానములు యేకకాలమునందు గలుగనేరదు. ఇంతేగాక తనస్వరూపమును పరులస్వరూపమును సహా ఒకతూరి తెలియుటకు కాదు; గాన, చిత్తము స్వప్రకాశమైనది కాదు. అయినను దృశ్యమై యున్నదని యెఱుంగవలయును.

అవ. చిత్తమునకు స్వతః యోగ్యత కలదనియును, వేఱొకబుద్ధిచేత యోగ్యత కలుగదనియును చెప్పుచున్నారు.—

20. చిత్తాన్తరదృశ్యే బుద్ధేరతిప్రసఙ్గః స్మృతిసంకరశ్చ.

తా. బుద్ధికి స్వప్రకాశకము లేకపోయినప్పటికిని, వేఱొకబుద్ధిచేత దర్శనయోగ్యత కలుగుచున్నదనఁగా అతిప్రసంగమగుచున్నది మఱియు స్మృతి మిశ్రమై పోవుటయు సహా కలుగుచున్నది.

వి. బుద్ధికి వేఱొకబుద్ధివలన జ్ఞానము కలుగు ననఁగా, ఆబుద్ధికి వేఱొక బుద్ధిచేత జ్ఞానము కలుగవలసివచ్చుచున్నది. దానికి మఱియొకదానిచేతను, దానికి వేఱొకదానిచేతను, ఇట్లు గుఱిలేక ఆయువు ముగియువఱకు ఉత్తరమును చెప్పినప్పటికిని పూర్తియగుటలేదు గాన, అధికప్రసంగమగుచున్నది. మఱియు, ఆ యనేకబుద్ధుల సంస్కారములచేఁ బుట్టు స్మృతి యెట్టిది? మఱియు నెట్టిదై యున్నది? ఇది యేబుద్ధిచేతఁ బుట్టినది? అని తెలియకయు, తాను ఏమి చేయవలయుననుట తోఁపకయు పోవుటచే ముక్తిపర్యంతమును ఒకేనిమిత్తమే యున్నదని తెలియఁదగినది.

అవ. బుద్ధికి స్వయంవ్యవహారజ్ఞానము కలుగుటకు కారణ మిట్టిదని చెప్పుచున్నారు.—

## 21. చితేరప్రతిసంక్రమాయా స్తదాకారాపత్తౌ స్వబుద్ధి సంవేదనమ్.

తా. మిశ్రమముకానట్టి చిత్ప్రకాశమునకు, ఆ చిత్తముయొక్క రూపప్రాప్తియందు చిత్తమందలి బుద్ధికి తెలివి గలుగు చున్నది.—

వి అంగాంగీభావముచేత పరస్పరము మిశ్రము గాక యుండు చిత్ప్రకాశము, ఎప్పుడు చిత్స్వరూపము గలది యగుచున్నదో, అప్పుడు చిత్తము స్వస్వరూపమును వహించును.

అంగాంగీభావ మనఁగా:— ప్రసరించుచుండు పరమాణువు లెట్లు వస్తువులయందు కూడికొను చున్నవో, అట్లు చిత్ప్రకాశమును చిత్తాకారమును వహించును. అప్పుడు బుద్ధికి స్వస్వరూపజ్ఞానము కలుగును.

అవ. చిత్ప్రకాశముతోఁ గూడిన చిత్తము సకల వ్యవహారములను స్వయముగా నిర్వహించు చున్నదని చెప్పుచున్నారు.—

## 22. ద్రష్టృ దృశ్యోపరక్తం చిత్తం సర్వార్థమ్.

తా. చిద్రూపపురుషుఁడు, విషయము అను నీ రెంటిచేఁ గూడినట్టి చిత్తము, సకలవిషయములను గ్రహించునట్టి శక్తి కలదిగా నున్నది.

వి. చిత్ప్రకాశముతోఁ గూడియుండు, దృశ్యపదార్థమువలె పరిణమించుటంజేసి బుద్ధికి సకలవ్యవహారజ్ఞానము కలుగుచున్నది.

ఎట్లు లనఁగా:— నిర్మల మైనయద్దము పొందలగువానికి ప్రతిబింబగ్రాహణశక్తి కలిగియున్నట్లు, రజస్తమోగుణములసంబంధము లేని శుద్ధసత్త్వగుణమాత్రము గల బుద్ధి, చిత్ప్రకాశమును గ్రహించును. ఈబుద్ధి నిశ్చలమైయుండు దీపమువలె, సదా యేకరూప మైన పరిణామము కలదియై, చిత్ప్ర

కాళమును గ్రహించునట్టి శక్తిని కలిగి యుండుటవలన మోక్షము వఱకును యేకాకారమై యున్నది.

అయస్కాంత సమీపమునందు, లోహమునకు స్వయముగా శక్తి కలిగి యేలాగు చలించు చుండునో, అట్లే చిత్పురుషునియొక్క సాన్నిధ్యమునందు చిత్తముయొక్క సత్త్వభాగమైనబుద్ధికి శక్తికలిగి సకల వ్యవహారమును నిర్వహించుచున్నది.

ఈ శాస్త్రమునందు నిత్యోదితాచిచ్ఛక్తి యనియును, అభివ్యంగ్య చిచ్ఛక్తి యనియును రెండువిధముల శక్తులున్నవి. అవి యేవనగా:—

చిత్స్వరూప పురుషునియందుండు శక్తి నిత్యోదితాచిచ్ఛక్తి ఆ చిత్స్వరూపపురుషుని సాన్నిధ్యముచేత అభివ్యక్తమైన చైతన్యముగల చిత్తమందలి శుద్ధ సత్త్వభాగము అభివ్యంగ్యచిచ్ఛక్తి ఇది చిద్రూప పురుషునకు అతి సమీపమునం దుండుటంబట్టి, భోగ్యవస్తు (భోగమును అనుభవించుటకు యోగ్యమైన వస్తువై యున్నది. ఈ యభివ్యంగ్యశక్తిని సాంఖ్యులు పురుషునకును పరమాత్మకును మధ్య ఆశ్రయభూతమై యుండు కర్మకు అనుగుణమైనదై సుఖభోగార్హమైనదై యున్నదని చెప్పెదరు. చిత్తమందు కర్మ పరిపాకముచే రాజస తామస గుణములు వుద్రేకమైనప్పుడు, ఆ గుణముల యందు ఈ అభివ్యంగ్యశక్తి తన ఆకారమును సమర్పించుట (ప్రతిఫలించుట) చేత ఆ గుణానురూపమైన కర్మఫలమును ఈ అభివ్యంగ్యశక్తి అనుభవించును. మఱియు చిత్తమం దుండు రజస్తమోగుణములు సహా ఆ అభివ్యంగ్యశక్తివలన చేతనము గలవైయె దుఃఖాదికర్మములను అనుభవించుచున్నది. కొందఱు ఈ సకల దుఃఖములఫలములును ఈ సాత్త్విక గుణములకు అతి సమీపమునం దుండు పురుషునియందు ఆరోపించెదరు. విద్వాంసులైనవారిలో కొందఱు ఈ అభివ్యంగ్యశక్తిని తత్త్వమనియు, ఆత్మయనియు వ్యవహరించెదరు. మఱి కొందఱు సత్త్వభాగము పురుషునియొక్క ప్రతిబింబమును వహించుచున్న దనియును, ఈ ప్రతిబింబమును రజస్తమములు క్రమముగా వహించుచున్న

వనియును, ఈ పరంపరయొక్క ప్రతిబింబముల నన్నింటిని ప్రతిబింబములనియే వ్యవహరించెదరు.

అయినను, నిజమైన ప్రతిబింబము సత్త్వమునందు మాత్ర మున్నది. ఆకారాదులు లేని చిద్రూప పురుషుఁడు నిర్మలమైన సత్త్వమునం దేలాగు ప్రతిఫలించు ననఁగా:—ఆకారశూన్యమై నిర్మలమై వ్యాపకమై యుండు ఆకాశము దర్పణాదులయం దెట్లు ప్రతిఫలించునో, అట్లు పురుషుఁడు సహా నిర్మలసత్త్వమునందు ప్రతిఫలించును. ఈ ప్రతిఫలించుటకు (ప్రతిబింబమునకు) బాహ్యమందలి వస్తువిషయముల సాక్షాత్కారముచే పురుషుఁడు భోక్త యని చెప్పుట యుక్తముకాదు. మఱియు, ప్రకృతి పరిణమింపక యున్నయెడల, ఆ సత్త్వభాగమే కలుగదు. కాన అప్పుడు యే తొందరకును కారణములేక యుండును.

ఈ ప్రకృతి యెందుకొఱకు పరిణమింపవలయు ననఁగా:—స్వయం జడమైన దేహేంద్రియా ద్యవయవమును, అంతరాత్మచే చేతనజ్ఞానము కలదియై ఆ ఆత్మనిమిత్త మేలాగు సకల వ్యాపారములను స్వయముగా నిర్వహించుచున్నదో, అట్లు స్వయంజడమైన ప్రకృతి చిత్పురుషుని యందుండుట వలన చేతనజ్ఞానము కలదియై, ఆ చిత్పురుషునకు భోగమును సంపాదించి యిచ్చు ననెడు సంకల్పముచే మహదాది మహాభూతముల పర్యంతమును అనులోమ పరిణామమును మఱలనే క్రమముగా పరిణమించెనో, అదే క్రమముగా వెనుక వెనుకను తమతమ కారణములయందు లయము నొందుచు పోవు నట్టి విలోమపరిణామమును పొందుచుండు మూలముగా పురుషునకు భోగమును కలుఁగఁజేయుట ప్రకృతికి స్వభావమైన పనిగా నున్నది. ఇట్లు మోక్షము వనుక భోగమును సంపాదించి యిచ్చుచున్నది.

అయినను, ప్రకృతికి స్వభావముగానే ఇట్టి అనులోమ విలోమ పరిణామములు కలుగుచున్నయెడల, ఈ పరిణామమునకు పర్యవసానము లేదు

గాన, మోక్ష మనునదే లేక పోవును. మఱియు మోక్షోపదేశశాస్త్రాదుల వలనను ప్రయోజనము లేక పోవును.

ప్రకృతి పురుషులకు భోగ్య భోక్తృభావసంబంధము అనాదియై నదిగా నున్నను, చేతనమును బొంది యుండు ప్రకృతియొక్క అంశము కర్తృత్వాభిమానముచేత దుఃఖాదుల ననుభవించు చుండఁగా, ఈ దుఃఖ నివృత్తి యెట్లు కలుగుచున్నదనెడి యాలోచనవలన అవశ్యకముగా మోక్షము నందు ప్రయత్నము కలుగుచున్నది అందు కొఱకు శాస్త్రములు వలసి యున్నది. ఇదే ప్రకారముగా సకలశాస్త్రములయందును జెప్పఁబడియున్నది గాన, చిచ్ఛక్తిని బొందియుండు బుద్ధితత్త్వము విలోమపరిణామక్రమము చేత కైవల్యమును బొందుచున్నది. అనులోమ పరిణామక్రమముచే జగ ద్వ్యాపారమునంతయు స్వయముగా నిర్వహించుచున్నది. ఇట్లు చిత్తము యొక్క స్వరూపము నిరూపింపఁబడినది గాన, దీనిపై వేఱె యేవిధమైనట్టి ఆక్షేపమునకు అవకాశము లేదు.

అవ. చిత్తముచేతనే సకలవ్యవహారమును కలుగు ననఁగా, పురుషుని వలనిప్రయోజన మేమని వితర్కించుచున్నారు.—

23. తదసంఖ్యేయవాసనాభి శ్చిత్ర మపి పరార్థం సంహ త్యకారిత్వాత్.

తా. (ప్రకృతియు పురుషుఁడు సహా మిశ్రమై అర్థ క్రియాలను (ప్రయో జన వ్యవసాయములను) చేయుటవలన, ఆ చిత్తము లెక్కలేని సంస్కార ములచేత నానావిధములుగా నున్నప్పటికిని, చిన్మాత్రుఁడైన పురుషునకు భోగమోక్షరూప మైన ప్రయోజనము కలుగుచున్నది.

వి. పురుషునియొక్క చేతనమును పొంది కలుగునట్టి వ్యవసాయ మును, దానిఫలములును సహా పురుషునకు మాత్రమే ప్రయోజనకారి యైనది గా నుండుటవలన, కారణపురుషుఁ డొకఁ డున్నాఁ డని తెలియఁబడు చున్నది. ఎట్లనఁగా.—

సో్ఢ అర్థ క్రియాకారు లైన భోజనశయ్యాదు లెట్లు పరప్రయోజనకరమై నదిగా నున్నవో, అట్లే చిత్తరూపక మైన సత్త్వాదిగుణములయొక్క పరిణామధర్మము లన్నియు పరప్రయోజనకరములై యున్నవి. ఎవఁడు పరుఁడో వాఁడే చిన్మాత్ర పురుషుఁ డని తెలియఁదగినది. భోజనశయ్యాదులు శరీరమున్నంతవఱకు ప్రయోజనకరమై యున్నవి. ఆ శరీరమైన పరునకు ప్రయోజన మేమి యనఁగా:—స్థూలపదార్థములచే స్థూలదేహములకు దృష్టాంతము చెప్పియుండుటచే, నిర్మలమైన శుద్ధసత్త్వగుణమును బట్టి నిర్మలుఁడైన పురుషునకు దృష్టాంతము చెప్పఁబడినది గాన, ఆక్షేపమునకు అవకాశము లేదు. మనకు కలుగుచుండు ప్రతియొక్కొక్క ప్రయోజనమును బట్టి, యెవరికి కలిగినదని క్రమముగా విభజించుచు పోయినయెడల తుదకు యెక్కడ నిలిచిపోవుచున్నదో, అక్కడనే పురుషుఁ డున్నాఁడని తెలియును. ఎట్లనఁగా.

దీపము యెవరికి ప్రయోజనమైనదని నిఃజించుచు పోయినయెడల మొదట శరీరమున కని తెలియుచున్నాఁడు; తర్వాత కన్నుల కని తెలియుచున్నాఁడు; ఆమీఁద బుద్ధి కని తోఁచును. తర్వాతను విభజనచేయఁగా ఆ బుద్ధియందలి చేతనమున కని తెలియును. ఆ చేతనము ఎవరి దనఁగా, ఆత్మ యొక్కది యనును. కాబట్టి, ఆ ఆత్మయే చిద్రూపపురుషుఁడు గాన సకల ప్రయోజనములును యీ ప్రకారము చిద్రూపపురుషుని నిమిత్త మని తెలియఁబడుచున్నందువలన, పురుషుఁ డున్నాఁ డనుట చక్కఁగా తెలియఁబడుచున్నది.

చిద్రూపునికంటె ఇవతలనే వీని ప్రజ్ఞ యుండుటవలన ఆ చిద్రూపునికంటె మీఁదనుండు నిర్గుణపరబ్రహ్మము చెప్పుటకు కాదు. ఏలనఁగా:— ఆ పరబ్రహ్మము వేదములకును వాక్కులకును అతీతమై యున్నందున చెప్పుటకు కానేరదని తెలియఁదగినది.

అవ. ఈ శాస్త్రప్రయోజనమైన కైవల్యస్వరూపమును (ఆత్మసు) నిరూపించుచున్నారు.—

## 24. విశేషదర్శిన ఆత్మభావనా నివృత్తిః.

తా. చిత్తము వే అనియును, చిద్రూపపురుషుఁడు వే అనియును చక్కఁగా తెలిసినవానికి; చిత్తమే ఆత్మ యనెడుభావము లేకపోవుచున్నది.

వి. చిత్తమును పురుషుఁడును వేర్వే అని అంతరదర్శనముచే తెలిసిన వాఁడు భ్రాంతిచేనైనను చిత్తమును ఆత్మ యని యెంచ నేరఁడు.

అవ. చిత్తమునందలి ఆత్మభ్రాంతి నివృత్తి యయినమీఁద యేమి కలుగు ననుటను వివరించుచున్నారు.—

## 25. తదా వివేకనిమ్నం కైవల్యప్రాగ్భారం చిత్తమ్.

తా. చిత్తమందలి ఆత్మ భ్రాంతి పోయినమీఁద, వివేకరూపజ్ఞానము నందు అంతర్ముఖమై యుండు చిత్తము మోక్షముయొక్క ప్రారంభమునం దుండును.

వి. చిత్తమే ఆత్మ యనెడు భ్రాంతి నిశ్శేషము తొలఁగినప్పుడు, వివేకజ్ఞానమునందు అంతర్ముఖమై (విశ్రాంతినొంది) కైవల్యపదముయొక్క మొదటిభాగమునం దుండును.

అవ. వివేకచిత్తమునందు వాసనలు కలుగుటకు కారణమును జెప్పుచున్నారు.—

## 26. తచ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః.

తా. వివేకజ్ఞానమునందు అంతర్ముఖమై యుండువానికి, అవివేకజ్ఞానము యొక్క అంతరాళమునందు బహిర్ముఖ కాలమునందు కలిగియున్న వాసనల వలన నేను, నాది, నాకు జ్ఞానము లభించినది, అను నిట్టి బహిర్ముఖసంబంధమైన అభిమానములు కలుగుచున్నది.

వి. వివేకజ్ఞానముచే అంతర్ముఖమై యుండు చిత్తమునందు అప్పుడప్పుడు బహిర్ముఖ కాలమందలి నేను నాది యను అభిమానములు కలుగుచుండును.

అవ. వాసనలను త్యజించుటకు ఉపాయమును వర్ణించుచున్నారు.

37. హానమేషాం క్లేశవ దుక్తమ్.

తా. అవిద్యాదిక్లేశములను త్యజించినట్లు, ఈ సంస్కారముల త్యాగ మును చెప్పఁబడినది.

వి. అవిద్యాదిక్లేశములను విడిచినట్లు ఈ సంస్కారములను విడువ వలయును.

అవ. వాసనా నిగ్రహామువలన లభించునట్టి మహా ఫలముయొక్క స్వరూపమును నిరూపించుచున్నారు.

28. ప్రసంఖ్యా నేప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతేః ధర్మమేఘస్సమాధిః.

తా. సకల తత్త్వముల నిజస్వరూపములను చక్కఁగా భావించుచు ఫలాపేక్ష లేనివానికి, సకల విధములుగానుండు వివేకజ్ఞానమునకు పురుషార్థ సాధక మైన పుణ్యపాపములు లేని ధర్మమును వర్షించునట్టి సమాధి కలుగు చున్నది.

వి. సకల తత్త్వముల స్వరూపవివేచనవలన దేనిని అభిలషింపక సర్వ తోముఖమై యుండు వివేకజ్ఞానము గలవానికి, పుణ్యపాపసంబంధములేని నిరతిశయానందరూప మైన ధర్మమేఘు మను సమాధియొక్క మహావర్షము సదా వర్షించు చున్నది. అనఁగా నిరవధిక పరమానంద సమాధి కలుగు చున్నది.

అవ. మీదఁ జెప్పఁబడినట్టి ధర్మమేఘసమాధివలన ప్రయోజన మిట్టి దని చెప్పుచున్నారు.—

29. తతః క్లేశకర్మనివృత్తిః.

తా. ఆ సమాధియొక్క దశవలన అవిద్యాదిక్లేశముల యొక్కయు పుణ్యపాపకర్మముల యొక్కయు నివృత్తి కలుగుచున్నది.

వి. అధర్మమేఘరూపమైన సమాధివలన, క్రమముగా సకలక్లేశకర్మములు క్షయించుచున్నది.

అవ. క్లేశకర్మనివృత్తికి తర్వాత కలుగఁగలదానిని వర్ణించుచున్నారు.—

30. తదా సర్వావరణమలాపేతస్య జ్ఞానస్యానంత్యాత్ జ్ఞేయమల్పమ్.

తా. అప్పుడు చిత్తమును చుట్టుకొని యుండు సకలక్లేశకర్మములనెడు కల్మషమువలన విడువఁబడిన జ్ఞానములు ప్రతిబంధకము లేకపోవుటంబట్టి తెలిసికొనఁదగినది స్వల్పమై యున్నది.

వి. జ్ఞానమును ఆవరించుకొని యుండునట్టి సకల క్లేశకర్మములు లేకపోయి నిరవధికమైన ఆకాశమువలె స్థిరమైన జ్ఞానముచే సుఖకరమై అడ్డుపాటులేక సకలమును తెలియుచుండును. అనఁగా సర్వజ్ఞుఁడే యగును.

అవ. ఈ జ్ఞానానంతరము కల్గుదానినిగూర్చి చెప్పుచున్నారు.—

31. తతః కృతార్థానాం పరిణామక్రమసమాప్తి ర్గుణానామ్.

తా. ఆ జ్ఞానము కల్గిన అనంతరమునందు చేయఁబడునట్టి భోగాపవర్గరూప పురుషార్థములుగల సత్త్వాదిగుణములయొక్కయు, మోక్షమువఱకును కలుగు అనులోమవిలోమపరిణామములయొక్కయు, ముందు వివరించిన క్రమముయొక్క సమాప్తి కలుగుచున్నది.

వి, వివేకజ్ఞానము స్థిరమైన యనంతరమై పురుషప్రయోజనకరములైన గుణములయొక్క అనులోమవిలోమరూపపరిణామములు తీరిపోవుచున్నవి. అప్పుడు చిత్తము విశ్రాంతిని బొందును.

అవ. సత్త్వాదిగుణములయొక్క పరిణామక్రమమును నిరూపించుచున్నారు.—

32. క్షణప్రతియోగీ పరిణామాపరాంతనిర్గ్రాహ్యః క్రమః.

తా. క్షణములే శత్రువులైయుండు పరిణామ (పరిపాక) ములయందు వెనుక ముందు అనుటకు చక్కఁగాఁ దెలియఁదగినది గుణపరిణామక్రమము యున్నది.

వి. ఒకదానిని వేఱొకటి వెనుక చేయుచుండు ప్రతిక్షణములందును ప్రధానతత్త్వమున మూలప్రకృతిని ఆధారము చేసికొని, పృథివ్యాది స్థూలభూతములవఱకును, అనులోమము పరిణామముఁబొందు క్రమమును; మఱియు, పరమాణ్వాది మహాభూతాంతమును, మహాభూతాది ప్రధానతత్త్వాంతమును సహా విలోమము పరిణామమును బొందు క్రమమును సయితము సత్త్వాదిగుణముల పరిణామక్రమ మనఁబడుచున్నది.

అవ. పరమపురుషార్థ స్వరూపమున కైవల్యస్థితియొక్క స్వరూపమును నిరూపించుచున్నారు.—

36. పురుషార్థగుణానాం ప్రతిప్రసవే కైవల్యం స్వరూప ప్రతిష్ఠా వా చితి శక్తి రితి.

తా. భోగమోక్షరూపములైన పురుషార్థములు గల సత్త్వాదిత్రిగుణములయొక్క పునరావృత్తిలేని విలోమపరిణామముయొక్క పరిసమాప్తిగాని, లేక పురుషునియందుండు చిత్ప్రకాశము స్వస్వరూపమయిన సచ్చిదానందమయాఖండపరిపూర్ణమయిన పరబ్రహ్మమందు నెలకొనుట గాని, కైవల్య మనఁబడుచున్నది.

వి. పురుషార్థరూపమున భోగాపవర్గపరిణామములు లేని సత్త్వాదిగుణముల విలోమపరిణామములయొక్క సమాప్తి కలుగుటయే ఆ నిత్యకైవల్య స్వరూపుఁడైన పురుషునకు కైవల్య మనఁబడుచున్నది. అనఁగా, పురుషునియందుండు చిత్ప్రకాశము అఖండానందపరిపూర్ణ సచ్చిదానందమయమునం దైక్య మగుట కైవల్య మనఁబడును.

ఇతి అనుపదము శాస్త్రపరిసమాప్తియొక్క అర్థమును చెప్పుచున్నదని యోజింపఁదగినది.

పాతంజలయోగశాస్త్రమునందు,

కైవల్యపాదము సమాప్తము.

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాల, చెన్నపురి. (24-12-40.) 500.